# అర్జున విజయము

గ్రంథకర్త

కోలాహలము బలరామరాజు.

నేషనల్ ముద్రణాలయంబున ముద్రింపఁబడియె.
మచిలీపట్టణము.

ప్రథమకూర్పు 500

1925



వెల 0-12-0

# కృతిసమర్పణము



గీ॥ సకలజగములు గలిఁగింప, సంహరింప,
సజ్జనావళిఁ బెంప, దుర్జనులఁ ద్రుంపఁ
గారణంబైన యాజగత్కర్తపాద
పద్మములకీకృతిని సమర్పణము జేతు॥

ఇట్లు
గ్రంథకర్త

# విజ్ఞప్తి

కొణిజర్ల పురంబున నేను మదీయ శ్రేయోభిలాషియు మద్గురువరేణ్యులును మాయన్నగారునునగు శ్రీయుత కోలాహలము సీతారామరాజుగారియొద్ద కావ్యాధ్యయనముం జేయు నప్పుడీ చిన్న నాటకమును వ్రాసితిని. ఇందలికథ గీర్వాణ భాషయందు భారవిమహాకవిచే రచియింపఁబడిన కిరాతార్జునీయమునుండి కొంతయు భారతారణ్య పర్వమునుండి కొంతయు గ్రహించి నాటక సాంప్రదాయానుగుణముగ నుచిత రీతిని మార్పులనొనర్చితిని. నాగ్రంథరచనమున కిదియే ప్రథమ ప్రయత్నమగుటంజేసి యిందెందేని స్ఖాలిత్యములున్న పాఠకమహాశయులు మన్నింపఁ బ్రార్థితులు.

ఏతద్గ్రంథమును త్వరలో ముద్రింప నన్నత్యంత ప్రోత్సాహపఱచి సహాయమొనర్చిన మ. రా. శ్రీ. పోట్లూరి సత్యనారాయణ, ఆరెకపూడి రామనాథము చౌదరీగార్లు మొదలగు మన్మిత్రులకుఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యములఁ బ్రసాదించుఁగాక.

ఇట్లు

విబుధవిధేయుఁడు

కోలాహలము బలరామరాజు

# ఇందలి పాత్రలు

## పురుషులు

సూత్రధారుఁడు
అర్జునుఁడు
మహేంద్రుఁడు
శంకరుఁడు
మృత్యుంజయుఁడు
మాతలి
బృహస్పతి
కవచాసురుఁడు
దినకరుఁడు
గోపాలుఁడు
గోముఖుఁడు
మణిగ్రీవుఁడు
కాలకేయుఁడు

## స్త్రీలు

నటి
పార్వతి
చండిక
ఊర్వశి
చారుమతి

సమయానుకూలముగా నందికేశ్వరాదులు వత్తురు.

శ్రీహయగ్రీవాయనమః.

# అర్జునవిజయము.

---

చ॥ వరదుఁడు భక్తవత్సలుఁడు పార్థతపఃపరితోషసంతతా
దరణుఁడు, పార్వతీసతియుతప్రణయార్ణవవీచికా సము
త్తరణుఁడు, ఘోరకల్మష విదారణకారణమౌనిహృద్వశం
కరుఁడగుశంకరుండొసఁగుఁగావుత, మీకునభీష్టితార్థముల్

(నాద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర. నటీ! ఒకసారి యిటువచ్చెదవా?

నటి. (ప్రవేశించి) మీకొఱకే వేచియుంటిని. నేఁడేనాటకమును ప్రదర్శింప నెంచితిరి?

సూత్ర. అదినీవే నిర్ణయింపుము.

నటి. ఏరూపక ప్రదర్శనమున రసికవతంసులగు నీసభ్యులరంజింపఁజేయఁగలమో అట్టివిజయ నాటకమునే కదా? నేవచించెదునేమి?

సూత్ర. (నవ్వుచు) విజయనాటకమా? అనగా భారతనాటకమేదైనఁబ్రదర్శింతమనియా? నీయభిప్రాయము. నీకు భారతకథాభిలాష మెక్కుడు.

నటి. (చిఱునగవుతో) ఔను? అందలి మాహాత్మ్యమేమిటో నేనూహింపఁజాలఁగాని యా మహాగ్రంథమునుఁ జ

దువుచున్న కొలందియుఁ జదువవలయునని యే యత్యం
తాభిలాష జనించుచుండును.

సూత్రి. సమస్తాలంకారములకు నదిగని. ధర్మములకు నిల
యము. రసముల కాలవాలము.

నటి. సరసరసాలఫలమువంటి సహజమాధుర్యము గలదగుట
చే దాని నిటీవల కవు లెందరెందరు వ్రాసినను శోభించు
చునే యున్నది.

సూత్రి. ఔను! అట్టిదికనుకనే మహర్షులు సైతము పంచమవేద
మని పేరిడిరి. నీయభిప్రాయ మిదివరకేగ్రహించి
యుండుటచే నేటిపరిదర్శనమున నర్జునవిజయమను నొ
కభారతనాటకమునుఁ దెచ్చితిని.

నటి. సహధర్మచారిణుల న్వర్థాభిధానులుగానుండ నభిలషించు
నేటి కాలమునమీావంటివారే యువతీమణులముద్దుఁ జె
ల్లింపకుందురా?

సూత్రి. ఔను?

గీ॥ పార్థుతో బోరనేగుసర్వజ్ఞమౌళి
భూధరాత్మజఁ గూడఁ గొంపోవురీతి
మానినీ? నిన్నుబోలిన మానవతుల
ముద్దుఁ జెల్లించుటేనీతి; పురుషులకును॥

నటి. (సిగ్గుతో) గ్రంధకర్త పేరుఁ జెప్పరైతిరి.

సూత్ర. గీ॥ క్షితినికోలాహలాన్వయక్షీరజలధి
రాజయినయట్టి యప్పలరాజునకును
రామమాంబా మణికిని పుత్రకుఁడు వీరి
నామధేయంబు వినుబలరామరాజు॥

నటి. (ఆలోచనమభినయించును)

సూత్ర. ఏదోఆలోచించుచున్నావు?

నటి. రసికజనామోదిని. రామాయణసార నాటకాదిగ్రంథము
లువ్రాసినజంటకవులలో కోలాహలము—

సూత్ర. (స్మృతి నభినయించుచు) మరచితిని? మంచివిషయము
జ్ఞప్తికిఁదెచ్చితివి. ఈ గ్రంథకర్త సభాస్తారులతో విన్న
వింపుమనిన విజ్ఞప్తియొకటి కలదు.

నటి. శీఘ్రముగ సెలవిండు.

సూత్ర. ఆ॥ "అగ్రజుండు గురువునైన సీతారామ
రాజుచరణములకు రాణమీఅ
నతిశతంబులను నొసర్చివ్రాసితిదీని
విబుధులాదరింప వేడికొందు,"॥

నటి. బాగుబాగు? ఇకమనమేగి గౌరీశంకరులమై ప్రేక్షకమ
హాశయులకు హృదయాహ్లాదముగ నీ రంగస్థలము నలంక
రింతము రండు.

(నిష్క్రమింతురు)





# అర్జున విజయము

ప్రథమాంకము.

(ఇంద్రకీలాద్రి యందర్జునుఁడు ప్రవేశించుచు)

అర్జు. నేటికి దినత్రయంబునుండి కన్నువిచ్చినను జూచినను నాజనయిత్రి కట్టెదుట సాక్షాత్కరించుచున్నది. తపోనిష్ఠవహించి దేవతా సందర్శనమున నభీష్టార్థములఁ బడయ నెంచెడివారికిఁ బ్రథమమున మాతృదేవతా సందర్శనమగుట యత్యంత శ్రేయస్కరము.

గీ॥ దైవమునకును, గురునకుఁ, దండ్రికన్నఁ
బ్రథమపూజార్హ మాతృదేవతయటంద్రు
గాన మనకెల్ల వేళల మాతృపాద
సేవ సంతత కల్యాణసిద్ధి గాదె॥

ఈయింద్రకీలాచలమునందలి పావనంబులగు తాపసాశ్రమంబులఁ జూడ మహాహ్లాదకరంబగుచున్నది. వేవెత్తెంచినదాది కమల షండ మండితంబగు నీరాసారంబు సహాకారిగనున్నది. (పరిక్రమించి) మహేంద్రా శ్రా

ధనమునకు వేళయగుచున్నది. గాన నాశ్రమస్థలంబునకు
కరిగెద.

(మహేంద్రుఁడు వృద్ధతపస్వి రూపమునఁ బ్రవేశించును)

మహే. హరిహర బ్రహ్మలుండ నీధనంజయుండు నన్నుంగూర్చి తపంబాచరించుటఁ జూడ నితనికి నాయందుఁ గల భక్తిప్రపత్తులు వ్యక్తంబగుచున్నవి. మఱియు నీతని తపశ్చర్య చూపఱకు వింతఁగొలుపుచున్నది. ఎలనన?

చ॥ ఘనతరమైన శస్త్రములు గాండివముం గవకేలఁ దాల్చి వీ
పున శరధిద్వయంబు వడిపూని దురంబు సరింపసిద్ధమై
చనుగతిఁ దాఁ గిరీటకవచంబులఁ దాల్చినిష్ఠమై తపం
బునుఁ బొనరించెఁ భువనమోహనమూర్తి కిరీటి యెయ్యెడన్

సమీపించి యీతని మనోనిశ్చలముం బరికించెద.

(సమీపమున కేగి కూర్చుండును)

అర్జు. (చూచి) తాపసోత్తమా! నమస్కారము.

మహే. మనోభీష్టార్థ సిద్ధిరస్తు.

అర్జు. ఆర్యా! తమనామధేయాదులు విననర్హుండనేని యానతీయ గింపవేఁడెద.

మహే. ధనంజయా! ఇవ్వనంబునఁ దపమాచరించు నొకతాపసిని. నీవు మధ్యమపాండవుఁడవనియు నస్త్రలాభార్థివై తపంబొనరించుచుంటివనియు దివ్యదృష్టిని గ్రహించి నీకొకహితోపదేశముఁ జేయవచ్చితిని.

అర్జు. (తనలో) ఈతని తేజోవిశేషంబులు దుర్నిరీక్ష్యముగ నున్నవి. (ప్రకా) దయచేసితాము కరుణింపఁదలఁచిన హితోక్తులు విన సావధానుఁడ.

మహే. పార్థా! వినుము.

ఉ॥ శత్రులగెల్వఁగాఁదలఁచి సంగరమందున దివ్యబాణముల్
గోత్రవిరోధిచేఁబడయఁగోరి తపంబొనరించుచుంటివి
మాత్రమెఱుంగ వక్కట! అమాయకుఁడా! రిపుసంగరంబులం
దాత్మముఁజెంది పారునతఁడా? యిదునీకుజయాస్త్రశస్త్రముల్॥

గీ॥ హరినిఁగూర్చియో! లేక శంకరునిగూర్చి
యో! కమల సంభవుంగూర్చియో! తపంబుఁ
జేయుమందునఁగల్గు నక్షీణదనుజ
శాసనోదగ్ర శస్త్రసంచయమునీకు॥

అర్జు. (తనలో) ఏమిది? ఈమానినోటనుండి విపరీతోక్తులు వచ్చుచున్నవి. కారణము గ్రాహ్యంబుగాకున్నది. అయిననిట్లుఁబల్కెదను. (ప్రకాశముగా)

గీ॥ అనవరతమును పరమ హంసావతంసు
లైనమునుల మహేంద్రు నత్యంతభక్తి
తోడ; యాగహవిస్సులందుష్టుఁజేయఁ
దమరిటులఁబల్కఁగాఁనాన తాపసేంద్ర! ॥

మహే. అర్జునా! ఎంత వెఱ్ఱివాఁడవు నాకొఱకిట్లు చెప్పుచుంటినా? యేమి? సుకుమారశరీరుఁడవగు నీ నిరర్థక శ్రి

నాంజూచి హితముఁ జెప్పితిని. తర్వాత నీయిష్టము.

ఈ మహేంద్రుు పరాక్రమముఁ దెలియుట కొక్క కార్యాణం జెప్పెదఁజూడు. దశకంఠ తారకాసురాదు లెంద రెంద రీతనిం జెనకి జయలక్ష్మీశోభితులుగారు?

గీ॥ ఒక్కఁడన నేల వినుకృతయుగమునుండి
ద్వాపరము దాఁగఁబుట్టిన దనుజులిందుఱ
నోడఁగొట్టరె? మాధవుండుండఁబట్టి
సరగనీతని యాటలు సాఁగివచ్చె॥

అర్జు. త్రిభువనేశ్వరుండగు విబుధనాయకుంగూర్చి యకారణ నిందారోపణముం జేయుట తమకుచితముకాదు. ఇట్టి కార్పణ్యావాక్యముల నమ్మి నేను సురేశ్వరారాధనము మానువాఁడనుగాను.

మహే. త్రిభువనేశ్వరుఁడగుట నిక్కమేగాని యట్టిపదవికి మాత్రమిందుఁడు దనర్హుఁడు.

సీ॥ కాయంబుఁజూతమా? గౌతమఋషిశాప
దగ్ధమైవేయి నేత్రములఁబడసె
శీలంబుఁజూతమా? చెన్నంటిజారత్వ
మునకు నీతండు పెట్టినది పేరు
హృదయంబుఁజూతమా? ఎవ్వానిచేనాక
పదవి పోవునోయంచు భయమెమెపుడు
శౌర్యంబుఁజూతమా? సర్వదైవతరాజ్య
పరిపాలనకుఁదగ్గబలము లేదు॥

తుచ్ఛులమగుటచే మహేంద్రుఁగూడ నట్టివాఁడని తలంచుచుంటిమా? చూఁడు నిన్నెన్నియిక్కట్లపాలుఁ జేసెదనో?

అర్జు. (తనలో) మునులతోడివాదములు "పాములతోడిచెల్లాటము" లవంటివి. తుదకితఁడు దురాగ్రహియై నాఁడు. కాన నీతని తాపసత్వము స్వతస్సిద్ధమైనదిగాక తెచ్చిపెట్టుకొన్నదని తెలియుచున్నది. కానిమ్ము. ఈతనితో ప్రసంగము ముగించి నావిధికృత్యమును నేను నిర్వర్తించుకొందును. (ప్రకాశముగా) మహేంద్ర పూజా సమయమైనది. తత్కార్యమునకై గడచెదను.

మహే. (తనలో) నేనెన్నివిధములఁ బోధించినను వీనిమనస్సు చలింపకున్నది. ఇతని యేకాగ్రత శ్లాఘాపాత్రము. ఇఁక స్వస్వరూపము ధరించెద. (స్వస్వరూపముతో ప్రకాశముగా) అర్జునా! ప్రశంసార్హమగు భక్తిచే నన్నుఁగూడ నతిశయింపఁజాలితివి. నీ యేకాగ్రత కెంతయు సంతసించితి.

అర్జు. (తనలో) నాయదృష్టవశమున దైవపతిప్రత్యక్షమైనాఁడు నన్నుఁబరీక్షింప నిట్లు మునియయ్యెఁగాబోలు. (ప్రకాశముగా) తండ్రీ! దివస్పతీ!

సీ॥ సకలలోకంబులే సార్వభౌమునియాన
జవదాటకే వేళసంచరించు
స్వప్నమందేని నేభవ్యాత్ముఁ గాంచినఁ
గులపర్వతంబు లాకులతఁ బొందు

గరుడ గంధర్వ ఖేచర సిద్ధ సాధ్యులే
గుణగణ్యులై నీభక్తిఁ గొల్చుచుండ్రు
హరిచందనాది భూమిరుహంబులే దేవ
పారిజాత పాదపములై పెరుగుచుండు

గీ॥ ఏమహాత్మ్యుండు సితగజంబెక్కి తిరుగు
రమ్యనందన మేరియా రామసీమ
అట్టినినుభక్తిఁ గొల్వశక్యంబె నాకు
నిఖిలసద్గుణసాంద్ర! యోనిర్జరేంద్ర!॥

మహే. అర్జునా! నీయిచ్ఛవచ్చిన వరము వేఁడుము.

అర్జు. తండ్రీ! సర్వశాత్రవవిజయైక సాధనములగు దివ్యాస్త్రములొసఁగుము.

మహే. నీకోరిన యస్త్రంబు లిచ్చుటయేగాక స్వర్గరాజధానికింగొనిపోయి నిన్నర్ధాసనాసీనునింగావించెదను. అప్సరోగణ సేవితుండవై శాశ్వతస్వర్గసుఖంబు లనుభవించుచుండుము. మరలనీకీ మర్త్యలోకావాసమేటికి?

అర్జు. చ॥ వనరుచు నాదుసోదరులు వల్కలముల్
ధరియించి ఘోరకా
ననములఁ గాయకూరల శనంబుగఁ గష్టములందుచుండనో
యనిమిషనాథ! స్వర్గసుఖమందఁగఁజాలఁ గృపఁగాఁ విరోధిమ
ర్దననిసితాస్త్రశస్త్రవిసరంబులొసంగుము చాలు నిమ్మెడన్॥

మహే. అట్లే! నీకోరినయస్త్రముల నుపదేశించెద. మఱియు

శత్రుజైత్రంబులగు దివ్యాస్త్రంబులు లభించు నుపాయముఁ జెప్పెదవినుము.

అర్జు. మహేంద్రా! నాకుఁగావలసినదది యేయనుగ్రహింపుము.

మహే. మ॥ అతివేగకవలిదిప్పఁ జేరియుఁ టనత్యాసక్తి త్యాయ

సీ॥ పతినింగూర్చితపంబుసేయు మఱిపైఁబ్రత్యక్షమైయిచ్చునా

యుతగర్వాంధరిపుక్షితీశ దళనోద్యద్దివ్య శస్త్రాస్త్రసం

తతులన్ బాశుపతాదులయ్య నఘుచెంతంగల్గునో ఫల్గునా॥

(అంతర్ధానమగును)

అర్జు. చిత్తము. దేవరయాజ్ఞం దలఁదాల్చెద.

(నిష్క్రమించును)

(ప్రథమాంకము)

సమాప్తము.





# అర్జున విజయము

## ద్వితీయాంకము.

(హిమవత్పర్వత ప్రాంతమున గౌరీశంకరులు కిరాతరూపమున ప్రవేశింతురు)

శంక. ప్రేయసీ! ఏమంటివి?

పార్వ. మీరు కయ్యమొనర్చుచుండఁ జూడవలయునని యభిలాష.

శంక. (పరిహాసముగా) కావుననేకదా? సింగివైతివి.

పార్వ. (సిగ్గుతో) సర్వజగన్నేతలగుమీరే ఎఱుకలగుచుండ నేనుమాత్రము సింగినగుటలో నబ్బురమేమున్నది?

శంక. లేకేమి?

పార్వ. ఏమి?

శంక. సుకుమారశరీరవగు నీవువికృతరూపిణివగుటయే,

పార్వ. అడిగినంతనే వృథాచేయని దయామయులగు మీరీకిరాతులగుటో?

శంక. (చిరునగవుతో) భక్తపరీక్షార్థ మొకొక్కప్పుడిట్టివిపరీతవేషులమగుచుందుము.

పార్వ. ఔను. భక్తవత్సలులగు మీరీరూపమాలోచించియే తాల్చితిరి

శంక. (చిరునగవుతో) వేషముమారిన మనస్సుగూడ మారు ననుకొంటివా?

పార్వ. భక్తుని పైబాణప్రయోగము చేయఁగలరా?

శంక. కొంతశ్రమఁబఱచి పరీక్షించినగాని భక్తునికీర్తి ఆచంద్ర తారార్కము జనులకాదర్శకము గాదు. అందుకే కదా? మృగయావ్యాజమున నిట్లుబయలుదేరుట.

పార్వ. కులకాంతలకు పత్యనుసరణమేకదా! ధర్మము.

శంక. అవును. అర్ధాంగులకు కాదనినేరఁగలనా?

పార్వ. (సిగ్గుతో) మీమూర్తినిమిరుంతథువ వఱచుచున్నదీ మయూరపింఛమే.

శంక. నీవును

పార్వ. నేనేకాదు.

శంక. కాక

పార్వ. మీరెఱుఁగరా? ప్రియవస్తువుల మఱతురా?

శంక. నాప్రియపదార్థములలో నగ్రగణ్యవునీవే!

పార్వ. అగ్రస్థానము వహించునది నేనుకాదు.

శంక (చిరునగవుతో) నీవనునది నేనెఱుఁగుదును.

పార్వ. సర్వజ్ఞులుగారా?

శంక. ఇప్పుడా యనవసర ప్రసంగ మేల?

పార్వ. ఔను లెండు. అదియిచట అనవసర ప్రసంగముకాదా?

శంక. నీయనుమానమే నిన్ను వేధించుచున్నది.

పార్వ. సమయానుకూలముగ మాట్లాడుట నేడు నూతనమా?

శంక. మనఃపూర్తిగనే వచించుచుంటిని

పార్వ. నెమ్మదిగవచింపుడు. ఎవరయినవిందురు.

శంక. సతీమణివగు నీవొక కాంతనుఁ బరిగణింపఁదగునా?

పార్వ. మీా దయయున్న.

శంక. వేయిమాటలేల? నీకంటెనాకితఃపరము గలదా? అది యిదివఱకేవచించితినే? నామనం బెట్టిదియోయెఱుఁగవా?

పార్వ. (కేల్మోడ్చి) ప్రియా! ఎఱుఁగకేమి? నాయవజ్ఞను మన్నింపుఁడు.

శంక. (చేయిపట్టుకొని) హృదయేశ్వరీ! అదియవజ్ఞగాదు. చతురోక్తిగనే నన్బరీక్షించితివి

పార్వ. సర్వాంతర్యాములగు మిమ్మొకరు పరిశీలింతురా? (నందికేశ్వరుఁడు మొదలగు వారుకిరాతరూపమున గుక్కలతోఁబ్రవేశింతురు)

నంది. (శంకరునితో) దేవా! సర్వమునుసిద్ధమైనది. మీాయాజ్ఞయే యనశిష్టము

శంక. మూకాసురుఁడీ పాటికి బయలుదేరునా?

నంది. స్వామీ! చాలదూరమరిగియే యుండును.

శంక. అట్లైనమనము వెళ్లుదమురండు. సతీ! రమ్ము.

(నిష్క్రమింతురు)

(హిమాచలాటవినినొకనిముపల్లెసమీపమున అర్జునుం

డుధనుష్పాణియై ప్రవేశించుచు)

అర్జు. సీ॥ కన్నబిడ్డలకంటె గారవంబునఁబెంపఁ

బడుచున్న హరిణ శాబకములివియె,

ఫలమూలములకునై వని కేగియునికిప

ట్లకువచ్చు మాని బాలకులువీరె,

అమృతోపమాన గంగామృతంబునుగ్రోల

మఁదసాగెడు నాలమందలివియె

మునికన్నియలు నేర్పఁగను "నమఃపాహిమాం

శ్రీహరే" యనెడురాచిలుకలివియె

గీ॥ మానసంబులఁబ్రీతిమై మానసమున

కరుగుచుండిరి నీటికైయరుగొ? మాని

కన్నియలు; వీరెబావులుగట్టినార

వల్కలములూని నేత్రపర్వంబుగాఁగ॥

(పరిక్రమించి) ఈహిమవత్పర్వతమునందలి పరమా

ద్భుతప్రదర్శనముల నన్నిటింజూడ వేయినేత్రములుగల

దేవేంద్రునకు ఁగూడ సాధ్యమగునో? కాదో? యని

ముకేలనందుకొనుతరి మనంబేలకో సమరోత్సాహ భరితంబై యొకవిధంబగు నానందంబనుభవించిని. ఆహా! ఆయుత్సాహ ముందలంచిన యిప్పటికిని శరీరముగగుర్పొడుచుచున్నది. ఈ తూణీరములు సైతమెప్పటి వలెగాక నేడునాకంటికి ప్రభావంతములుగ కన్పట్టుచున్నవి. (కొంచెమాగి) అక్కటా! భక్తవత్సలుండగు పరమేశ్వరునకింకను నాయందనుగ్రహము గలుగదయ్యెనే? నేటినుండి యీవాయుభక్షణంబు సైతము మానియమ్మహాత్ముందు సాక్షాత్కరించువఱకు దీర్ఘతపంబాచరింతు. అప్పటికేనియు నయ్యీశ్వరునకు నాయందనుగ్రహముగలుగకపోదు. (మింటఁదృష్టిఁబఱపి) శివారాధన వేళయగుచున్నది. త్వరితముగ పుష్పములంగొనెద. (కోయుటనభినయించును) ఎవరోవచ్చుచున్నట్లున్నది. (తొంగిచూచి) మృత్యుంజయా! ఇటురమ్ము.

(మృత్యుంజయుఁడను మునిబాలుఁడు ప్రవేశించును)

మృత్యు. (ప్రవేశించుచు) అర్జునా! రాగలఁదు

అర్జు. అట్లుకాదు. వచ్చుచున్నాఁడనుము

మృత్యు. (చిరునగవుతో) అవును. నీవనినట్లే, పూవులుకోయుటయైనదా?

అర్జు. అయినది.

మృత్యు. (స్మృతినభినయించుచు) కన్నులుండినందులకు దర్శనీయమగుదానినే దర్శించితిని. ఇట్టి ధనుర్విద్యావిశారదుఁడవని యిదివరకెఱుఁగనుమీ!

అర్జు. ఎన్నఁడును ధనుర్విద్య చూడనివాఁడవగుటచే నీవట్లుత లంచుచున్నావు

మృత్యు. నేనేకాదు. ఇందలిమునులెల్లరును వేనోళ్లఁబొగడుచున్నారు.

అర్జు. ఎవరిని?

మృత్యు. నిన్ను

అర్జు. పొగడవలసినది నన్నుకాదు.

మృత్యు. ఎవరిని?

అర్జు. ద్రోణాచార్యులను,

మృత్యు. (మెప్పుతో) ఔను. ధర్మజుని తమ్ముఁడవు గావా? రసాల భూరుహముమ్మేత్త కాయలు గాచునని యెవఁడు తలంచును.

అర్జు. మిత్రమా! పొగడకుము.

మృత్యు. పొగడుటగాదు. ఈకాలములోమునులు కోరినంతనే సద్గుణవిరాజితుఁడవగునీవుకాక యెవఁడు మహాప్రసాదంబని ధనుర్విద్యా ప్రదర్శనముంజూపును?

అర్జు. పరమహంసలగు తపోధనులనిన భక్తిశ్రద్ధలు కలుఁగనివాఁడుండునా?

మృత్యు. నీవుమాత్రమట్లు తలంచుచున్నావు. రాజ్యమదాంధత్వమున మహారాజులు సైతమెందరెందరు మునీంద్రులఁదిరస్కరించివారిశాపోపహతులకు గురియగుట లేదు?

అర్జు. పోనిమ్ము. (స్మృతినభినయించి) నీలోకసంగతిఁజెప్ప మరచితిని. నేటినుండి యీవాయుభక్షణంబునుమానితపం బొనర్పనెంచితి.

మృత్యు. నీవంతశ్రమపడనక్కరలేదు, నీతపముఫలించినది.

అర్జు. అంతటి సుకృతము లభియించినగదా?

మృత్యు. అపహాస్యముగాదు. నిజముగ నీవ్రుధన్యుఁడవు. భక్త వత్సలుండగు చంద్రశేఖరుఁడు నీయెడ ననుగ్రహించి నాఁడు.

అర్జు. నీవెట్లుచెప్పెదవు?

మృత్యు. నేనుచెప్పనేల? అత్యద్భుతమగునీతపమేచెప్పుచున్నది

అర్జు. నీవనినంతటి తపముగాదు.

మృత్యు. ఎందుచేత?

అర్జు. దేవదేవునకింకను అనుగ్రహముకలుగక పోవుటచేత.

మృత్యు. ఇఁకతప్పకకల్గును. ఇదివరకే నీతపఃప్రభావమున నగ్నిజ్వాలలుద్భవించుచున్నవని నీతోచెప్పియుంటినిగదా? మహేశ్వరుండింక కొంతకాలముపేక్షించినచో నీలోకము లిట్లుండవు. (తెరలోకలకము భయమునొం) మిత్రమా! మేఘధ్వనియైనది. (మరలవిని) అదిగో!

గీ॥ ప్రళయకాలంపు మృత్యుగర్జనమురీతి
వినెడివారల మనములభీతిఁగొలుపు

సారమేయంపు గుములగర్జారవములు
నేడువినవయ్యో; నిచ్చటినెచటినొక్కొ?

అర్జు. (నిర్భయముగా) అవును. ఎచటనైనమనకేమి లెమ్ము. ప్రొద్దెక్కినది. త్వరితముగ ఆశ్రమమునకేగుదమురమ్ము (పరిక్రమింతురు) (తెరలో కలకలము)

మత్స్య. (భయముతో) అర్జునా! నీకీయుపేక్షతగదు. అటుచూడుము. ఏరాక్షసుఁడోవచ్చి ఆశ్రమములపైఁబడినట్లున్నది. రక్షించుట వశ్యకర్తవ్యము.

అర్జు. (వీపుతట్టుచు) మిత్రమా! భయపడకుము. నేనుండునంతవరకే రాక్షసుఁడునురాడు. వచ్చినను భయములేదు.

మృత్స్య. (గజగజవణకుచు) అయ్యో! ఇదియొక్కడిధైర్యము? ప్రాణముపోవనుండ భయములేదందువేల?

(తెరలో)

హా! ఈయరణ్యంబున సాధుపోషకులే లేరా? శరణాగతత్రాణ పరాయణా! మధ్యమపాండవా! నీవైనరక్షింపుము.

అర్జు. మునీంద్రులారా! ఏటికిట్లుభయభ్రాంతులరై పరుగెత్తుచుంటిరో వచింపుఁడు. ఎట్టివిపత్తులు సంభవింపనున్నను ఈపార్థుఁడు సాధులరక్షించితీరును. భయఁపడకుఁడు! భయఁపడకుఁడు!!

(తెరలో)

ఉ॥ ఏకలమేగుదెంచి మమునెల్లరఁజంపుచు నాశ్రమంబుఁజే
కాకొనరించుచుండె, నిఁకఁగాలుగదల్పఁగ లేముమమ్ములన్
కైకొనిబ్రోవుమయ్య కరుణామయ! పాండుకుమార! వేగనీ
సూకరదంత ఘట్టనసుప్రకరంబులు వోవకుండఁగన్

అర్జు. (ఎలుఁగెత్తి)

గీ॥ సమద దుర్జయవిదితదోస్సారశాత్రి
వాటవీ వీతిహోత్రుండ నైననేను
గలుఁగ వెరపేల? మునులార! తలఁకవలదు
మచ్ఛరాహతిసూకర మదమణంతు

మిత్రమా! అదిగో! ఆవరాహమిటేవచ్చుచున్నది. ఈబా
ణమున నేమగునో చూచుచుండుము. (అనివరాహముపై
బాణప్రయోగముఁజేయును)

(వెంట పార్వతివచ్చుచుండ శంకరుఁడీ క్రిందిపద్యముఁ జదువు
చు వడివడిగా ప్రవేశించును)

శంక. ఆ॥ ఎవ్వఁడవురనీవు? నేవధించినపంది
నేయనీకుఁబాడియే? మదీయ
బాణఘాతమునను బ్రాణావశిష్టమై
చచ్చుదానినే యశౌర్యమగునె?

వినోదార్థ మీసింగితోఁగూడ నేవథింప సమకట్టిన
ఈసూకరముపై మృగయాధర్మ విరుద్ధముగ బాణప్ర
యోగముఁజేసిన కపటతాపసివగు నీవెవఁడవురా?

అర్జు. ఓయీ! ఏటికిట్లు పేర్కొనెదవు?

గీ॥ పాండుభూపాలసుతుఁడను బార్థుఁడండ్రు
ధరణిజనములు; శివుఁగూర్చి తపముఁ జేయ
నేకలంబిందు తాపసహింసఁ జేయు
చుండఁజూచుచు నూరక యుందు టెట్లు?

క॥ కాపురుష దీనిని వధించితి
నీవకో స్త్రులనుమాని నీచను తో వణ
వేవేగఁబొమ్ము దీనం
గావలసిన దేమి? యిఁక వనాటవ కేన్యా?

. ఏమీ? ఈ యేకలమును నీవే చంపితివిగా?

ఉ॥ శూరుఁడుపోలెఁ బల్కితివి సూకరముం బడఁగూల్చి నాడ నే
ధారుణి నేఁచు; నంతభుజదర్పముగల్గిననిల్వు మాజి మ
ద్ఘోరశితాస్త్రపాతమునకుం వెనుఁ జూపక నిల్చి తేని భూ
దారముతావకాశుగవిదారణమే యని యెంతు నెమ్మదిన్

. (శాంతముగా) ఎఱుక జేడా! నాతో కయ్యమొనర్చుటకు నీవెంత వాఁడవు? నీకును నాకును కులభేదము గలదు. ఎందును సామ్యంబు లేని నీతో సంగ్రామంబొనర్చుట సమసమరమనిపించుకొనును. చిట్టడవిని కుటీరములు నిర్మించుకొనినివసించు కిరాతుండవు నీవును, శాంతమయుఁడనై యుమాపతిం గూర్చి తపంబొనర్చువాఁడను నేను, ఇదియిట్లుండ శివపూజ యొనర్చు సమయమతిక్ర

మించుచున్నది. ఇందలిశీతలజలంబులచే దప్పితీర్చుకొని కొండొకసేపువిశ్రాంతిం జెంది మీఁదారింబోందుము.

ఉ౦క. (తనలో) ఈతఁడుతనమధురవాక్యములచే వైరానుబంధముఁ దెగ్రింపివేయుచున్నాఁడు. ఎట్లైనను గయ్యముఁ బెంచెదఁగాక (ప్రకాశముగా) పార్థా! ఏమంటివి? నాతోఁగయ్యమొనర్చుటకు నీవెంతవాఁడవనియా? ఇట్టిడాంబికములం గట్టిపెట్టుము. నాయుత్తరువులేనిదే నాయీవనంబున కేట్లుప్రవేశించితివో? ముందుసమాధానముం జెప్పికదలుము. అట్లునిర్భీతుఁడవై ప్రవేశించి యిందలివనఫలంబులఁ బాడుజేయుటయేకాక మీఁదు మిక్కిలిమన్నుఁదిరస్కరించుచుంటివా? సమరమునకాయితంబై రమ్ము నీనాతారతమ్యములు తేలఁగలవు.

అర్జు. పుళిందాధిపా! నిష్కారణవైరము వలదనిచిలుకకుఁ జెప్పినట్లెన్ని విధములఁ జెప్పిననుఁ బెడఁజెవిం బెట్టియుద్ధముయుద్ధమని పలుపరించెద వేల?

సీ॥ భిల్లాంగనామణీ సల్లాపములుగావు,
దారుణసింహ నాదములుగాని,
ఉసులచేఁబట్టంగ హారిణంబులివిగావు,
తనువుఁజీల్చెడి మహాస్త్రములుగాని,
మోయునిండఁబూయుంగ పుష్పగమదంబునుగాదు,
విమతరక్త ప్రవాహములుగాని,

కడుపారభుజింయిపఁగా మాంసములుగావు,
రథభటాశ్వకళేబరములుగా॥

గీ॥ రామలంగూడు వనవిహారంబుఁగాదు
రౌద్రరసయుక్త రణవిహారంబుగాని
తులువ! దారులుఁగొట్టపాంథులునుగారు
దండితారాతియా పాండవుండుగాని॥

శంక. రాజా! వృథావాగ్వ్యయమేల? చేసైన సంగ్రామము నకాయితం బైరమ్ము. లేనిచో "జితోస్మి" యనితొలఁగుము. నాగృహిణియిది చాలకాలమునుండి రణరంగ ములంజూడనభిలషించు చున్నది.

అర్జు. (రోషముతో) దురాత్మా! ఏమనవలయు జితోస్మియనియా?

గీ॥ ఆయువుందీరిచావనున్నట్టిరోగి
కమృతమయమైనమేటి సిద్ధౌషధములు
నిష్ఫలంబౌవిధంబున నీకునాహి
తోక్తులురుచింప వక్యోనాయుస్సులేమి॥
నానిశాతశరంబులే నీకు బుద్ధిఁగరపఁగలవురమ్ము

(నిష్క్రమింతురు)

ద్వితీయాంకము
సంపూర్ణము.



# అర్జునవిజయము.



## తృతీయాంకము.

(పార్వతీ చండికలు రణముజూచుచు ప్రవేశింతురు)

పార్వ. సఖి! చూచితివా! హృదయేశ్వరుండును మధ్యమపాండవుండును నెట్లుపమాతీతరణం బొనర్చుచున్నారో?

గీ॥ దేవదేవుండు మహితప్రభావుఁడీతఁ
డతఁడో? కంఠగతప్రాణుఁడగువరకును
వెనుకఁదీయని భువనైక వీరవరుఁడు
గాననీయుద్ధ మాశ్చర్యకరముగాదె॥

చండి. ఏమిచూడుమనెదవమ్మా! చూచుటకు రెండునేత్రములుచాలుచున్నవా?

ఉ॥ శైలములున్ మృగేంద్రములు సామజముల్ జలరాసులున్ గ్రశా
ర్దూలములున్ మహాపటిమ తోడుతడీకొని పోరునట్లుగా

శూలియుఁ బార్థుఁడున్ విపులశూరతఁ జూపుచుఁ బోరుచున్న నీ
యాలముఁ జూడ నాఁటి త్రిదశాసుర యుద్ధము జ్ఞప్తి వచ్చెడున్

మహేశ్వరున కిట్టి శౌర్యధైర్యంబు లుండుట సహజమే కాని మృత్యుంజయునితో మనుష్యమాత్రుఁడగు పార్థుఁడు ఘోరసంగ్రామంబున సరిగాఁ బోరుట మహాద్భుతము కాదా?

పార్వ. అవును. నిజము పల్కితివి.

చ॥ కనుఁగొన నెంచి శౌర్యమును, గాళగళుండు; కిరాతరూపుఁడై
యని యొనరించు వేళ ధనునక్షయ బాణవిహీనుఁ జేసినన్
మనమున జంకి యుద్ధమును మానఁడు నోడితి నంచుఁ బల్కఁడీ
యనఘుఁడు గెల్చుటబ్బురమె? యాజని గౌరవ వీరవర్యులన్॥

చండి. దేవీ! ఇటుఁ జూడుము బాణవిహీనుఁడయ్యును విజయుం డెట్లు పోరాడుచున్నాఁడో? అవును. సార్థకనాముఁడే సుమీ?

(తెరలో)

పుళిందా! ఇంతమాత్రమునకే సంతసించుచుంటివా?

గీ॥ కులగిరుల పక్షములను వ్రక్కలుగఁ జేయు
పవిని హాసియించు మత్కరవాలహతిని
గాఁచికొని ప్రాణముల నిల్పఁగలిగితేని
వీరుఁడ వెయగాదు వికనేఁటి పోరునందు॥

పార్వ. ప్రాణేశ్వరుఁడా కరవాలముం గూడ మన్యనేశకలము

లుగాఁ జేయుచున్నాఁడు తనవ్రేటు నిరర్థక మగుటచే
రోషారుణిత లోచనుండై బీభత్సుఁడు గాండీవముం గై
కొని నాథునిమోదుటకై యెత్తినాఁడు. ప్రమథసైన్య
మును దేవతలును హాహారవ మొనర్చుచున్నారు. ఈ
వ్రేటువలన ప్రాణేశ్వరునకేమియు నపాయము గలు
గకుండుగాక?

చండి. దేవీ!

చ॥ కరమునను న్న గాండివము గైకొని సాహసమూని క్రీడిదా
హారుపయిబిట్టుమోదినవృషాంకుఁడునొవ్వక యున్నఁజూచిసం
గర మొనరించుచుండె రిపుఘస్మరుఁడోః ప్రధితప్రతాపని
ర్జర వరనందనుండవని జాతముఁగం బెకలించి నేర్పునన్

(తెరలో)

గీ॥ బిరుదుబంటవు గదరబాపురే! పుళింద!
మృత్యుజిహ్వోపమాన మహీజమిది యె
కాచికొనుమోరి! దీనిప్రఘూతమునను
ప్రాణములుపోవకుండ ధైర్యంబుతోడ॥

పార్వ. సాధుఁడుపాండవుండెత్తిన వృక్షములనెల్లఁ దుత్తునియ
లొనర్చుచున్నాఁడు పాండవుండంత నిలువక రాలనుగు
రిపించుచున్నాఁడు. అవియుఁద్రిపురారిశరంబులచేఁబొ
డిపొడియగుచున్నవి. అర్జునుఁడింకేమిచేయునో? సమీ
పమునకేగి చూతమురమ్ము.

(నిష్క్రమింతురు.)

(యుద్ధభూమియం దర్జునుఁడు ప్రవేశించును)

అర్జు. ఏమి? ఈవైపరీత్యము.

మ॥ మునుసప్తార్చియనుజ్ఞఖాండవవనంబుంగాల్చుచోఁబాకశా
సనముఖ్యామరులంజయించుతరినన్ స్వాంతంబునన్ మెచ్చియ
య్యనలుండక్షయబాణతూణములుసౌహార్దంబుతోనిచ్చె,మా
ర్గణమొక్కండును గానసిత్తరినిచిత్రింబిద్ది యేమాయయో!

సీ॥ రాజసూయమహాధ్వరముఁ జేయుచోధర
ణీశ్వరావళినిజ యించునాడు
గురుదక్షిణగరణక్షోణినిద్రుపదపృ
థ్వీపునంటంగట్టి తెచ్చునాడు
అఖిలదిక్పతియుతుండైన నిర్జరనాథు
గెల్చిఖాండవవనిఁగాల్చునాడు
పాంచాలికాస్వయంవరమునఁ గర్ణదు
ర్యోధనాదులఁబారఁదోలునాడు

గీ॥ మొక్కవోనట్టి మచ్చిలీముఖము లొక్క
యాఁటవికనాయకుని మదంబణఁచలేక
అక్కటా! యుద్ధమునిట్లువ్యర్థమయ్యె
దైవమాయగ నున్నదీతరిసిఁజూడ॥

గీ॥ కైటభారియొ! లేకశంకరుఁడో! కాక
ధాతయోకాని యెఱుకం డితండుకాఁడు
రిపువిదారణోద్యద్ధ నుర్విద్యశబర
కులునకీటితిఁగలుఁగు నొకో? తలంప

నాహవమందు నన్నెదురు నంతటివీరుఁడు లేఁడుగాని నీఁ
డాహవదోహలుండగుట నాజిమొనర్చె మహాద్భుతంబుగన్

సీ॥ అనలదత్తంబైన యక్షయశరధుల
మాయచేనొక్కెడ నురుగుఁబఱచి,
గాండీవ చండభీకరమహావాద్యఘట్ట
ననుఁదలంకకమనంబున సహించి,
తుదకు భూజాత సందోహంబు నిగుడింప
నదియును ఖండఖండములుఁ జేసి,
శితశరార్చుల నొవ్వఁ జేయ నిష్ప్రజ్ఞుం
డలసియుమనమున నుందలఁకువిడిచి,

గీ॥ నిరుపమనియుద్ధకుశలత్వనిరతిఁగాంచి
ప్రమథగణములు వెఱగందఁ బాహుయుద్ధ
మున సరాసరిఁబోరె నీభూనరుండు
విక్రమం బెంతొ? యతనివినయ మంతె॥

గీ॥ శౌర్యమును, పౌరుషంబును, శాంతి, దాంతి,
ధర్మగుణమును సత్యంబు, దయ, వినయము
గలనరుండు ప్రకాశించుగాని యొక్క
శౌర్యమున వన్నెరాదు నిశ్చయముగాను

పార్వ. నాధా! నిరాయుధుండును, విరథుండును నైయుండియే యీతఁడింతపరాక్రమముం జూపెఁగదా! రథియై శరశరాసనధరుండైయున్న నీతనిశౌర్యమెట్లుండునో?

శంక. అవును. అక్షయ శరధులం ధరియించి కృష్ణ సారథ్యం
బుఁగలరథంబుపై నుండిసమరంబుసేయునితనికి త్రిభువ
నంబులఁగల చరాచరజంతుకోటియుఁ దృణప్రాయము
పార్వ. నాథా! అర్జునుండింకను మూర్ఛనుండి లేవలేదు. బల
మైన ప్రేటుతగిలెనా యేమి? దగ్గఱకువెళ్లి స్పృశింపుఁడు.
శంక. ఆట్లేచేసెద.

(అర్జునుని స్పృశించును)

అర్జు. (లేచి శివునిఁజూడక యే రోషముతో) కిరాతా!

చ॥ పరువునఁబోకునిల్వుమిఁక ఫల్గునుఁడీయ[illegible]చుసం
బరపడిపోవుచుంటివో? [illegible]యమందునన్
బురహరుఁడేని శౌర్యము[illegible]లఁడే? రణభూమి వీడి; భీ
కరపటు ముష్టిఘాతమునఁగాచికొనందగు పొంపడంచెదన్

(శివునిఁజూచిస్వ.) అహాహా! ఇదియేమి? సర్వ చరాచరభూ
తగణరక్షాధు రంధరుండును, దుర్జనగర్వ విభంజనుండును,
కైలాస వాసుండును, నగుదేవదేవుండిదే నాచేసిన పుణ్య
పరిపాకమున సాక్షాత్కరించె. ఇంతతడవునుండియు నేనీమ
హామహునితోడనే సమరంబొనర్చుచుంటినా యేమి?
కాదు? ఈతఁడే యెఱుక రూపుధరించినమహేశ్వరుండు.

శా॥ ఆహా! ఎంతటి తప్పుఁజేసితిని దేవాధీశు, భూతేశునిన్,
దైత్యౌఘ ప్రహారదక్షు, సర్వుని, భక్తత్రాణపారీణునిన్,
గయ్యంబుం గిరాతుఁడంచు నవయంగాఁజేసితిన్ దప్పిదం

బయ్యెన్ భక్తవిధేయు నేమొగమునన్ బ్రార్థింతు దుష్టుండనై॥

ఈశ్వరాపరాధుండనై దుర్జనాగ్రగణ్యుండనై తిరుగదా! అయిన నిట్లుఁ బ్రార్థించెద. (ప్రకాశముగా)

సీ॥ అంబరకేశ నామాంకితం బెఱిఁగింపఁ
గాఁజాలుయుష్మదాకారరేఖ
మృత్యుంజయఖ్యాతియే చెప్పఁజాలుదు
ర్వారమగు భవదీయ బాహుబలము
గంగాధరాఖ్యవ్యక్తంబుఁ జేయునునిరం
తరమును సర్వభూభరణగరిమ
కాలకూటాశనాఖ్యయె తెల్పు సర్వాఘ
హరణ త్వదీయమహానుభావ
గీ॥ మిపుడు వేర్వేర నిను నుతియింపనెంత
వాఁడ సకలేశ! సర్వప్రపంచరూప!
తెలియకేఁ జేసినట్టి తప్పులుక్షమింపు
భూరికరుణాసనాథ! యోభూతనాథ॥

(కాళ్లపైఁబడును)

పార్వ. ధనంజయా! ఏలపశ్చాత్తాపుండవరా ప్ర. దేవదేవుండు నీయెడననుగ్రహించినాఁడు లెమ్ము.

శంక. (లేవదీసి)పార్థా! విజయనామము నీకును సార్థకముగ వర్తించుఁగాక ఇందు నీ తప్పిసుమంతయు లేదు.

చ॥ పలుమరు విందునీ వధికబాహుపరాక్రమశాలి వంచునేఁ
బలువురుఁజెప్ప నీబలము పౌరుషముం బరికింప నెంచియీ
కలహము బెంచినాఁడసుమి? కాంచితినీదగుశౌర్యసాహసం
బలఘుపరాక్రమక్రమసమగ్రతయచ్చెరువయ్యె ఫల్గునా॥

మున్ను బదరీవనంబున నత్యంత నిష్ఠాగరిష్ఠులై తపం బొనరించిన నరనారాయణులను ఋషులందునీవు నరుండను మహర్షివి. మీవలననే జగంబులు రక్షితంబులగుచున్నవి. భూభారహరణార్థమై మీరలేక్రమంబున యాదవపాండవవంశంబులఁగృష్ణార్జునులను నామంబుల జనించితిరి. ఈగాండీవము తొల్లినీయదిదీని చేశక్రాభిషేకంబునాడ సురులం జయించితివి. నీయక్షయతూణీరము లిప్పుడు నామాయచేమఱుఁగు పరచితిని. ఇవిగో! వానింగొనుము. (గాండీవమును అక్షయతూణీరములను నొసంగును)

ఇంకనీ యభీష్టవరంబులొసఁగెద కోరుము

అర్జు. దేవదేవా!

క॥ వరములనుగోరుమంటివి
పరమదయాకరుఁడవగుచుఁబాశుపతమునా
కరగు మహాస్త్రముగారీ
వర! శంకర! యొసఁగుమిదియె వరముమహాత్మా॥

దానం జేసి.

గీ॥ ద్రోణ, భీష్మ, సుయోధన, ద్రౌణి, కర్ణ,
శల్య, భగదత్త, బాహ్లిక, సౌబలాది
యోధులం గెల్చియిత్తు మత్సోదరునకు
రాజమౌళి! తదీయ సామ్రాజ్యమెల్ల॥

శంక. అర్జునా! నీకోరిన దివ్యాస్త్ర మొసంగె దరమ్ము ఈ పాశుపతాస్త్ర లాభమున భువనైకధనుర్ధరుండవయ్యెదవు. దీనివలనననేకాయుధంబు లుద్భవించి శత్రుమారణ కరంబులగును. దీని నల్పులపైఁ బ్రయోగింపకుము. అట్లు ప్రయోగించితివేని జగత్సంహారహేతుభూతంబగుసుమా!

అర్జు. తమయాజ్ఞానువర్తినై మెలంగెద.

(నిష్క్రమింతురు)

పార్వ. దివ్యాస్త్రపరిగ్రహణమున నర్జునుండధిక తేజస్వియైవాఁడు

(హరార్జునులు ప్రవేశము)

అర్జు. (సంతోషముతో) ఇప్పటికిఁ గదా! ధన్యుఁడనైతిని.

మ॥ జనవంద్యున్ జగదీశ్వరున్ సుజనరక్షాదక్షు క్షోణీరథున్
గనకాద్రీంద్రధనున్ గజాసురహరున్, గంగాధరున్ శర్వునిన్
దనుజారాతిసఖున్ మహేశ్వరుఁ గ్రతుధ్వంసిన్ భవానీశ్వరున్
గనుఁగొంటిన్ దొలిజన్మమందునను నేఁ గావించుపుణ్యంబునన్

పార్వ. ఫల్గునా! నీమెడవికాంతియెంతయో వినయముగూడ నంతఁగలదు దానను శోభించుట.

అర్జు. తల్లీ! నేనెంతవాఁడను. పురాణదంపతులగు మీాయను
గ్రహవిశేషమున

గీ॥ దుష్టులెల్లరు నేటితో దుగ్రింపడిరి,
కర్ణదుశ్శాసనాదులగర్వ మడఁగెఁ,
గన్నతల్లిపరాధీనగతిఁ దొలఁగె,
రాజధర్మజుఁడయ్యె, సామ్రాజ్యమునకు

శంక. ఓయీా! మాయనుగ్రహవిశేషంబుఁగాని యాఁడఁబ
లేదు. శుభాశుభంబులన్నియు మానవజీవితచరిత్రము
నందేయిమిడియున్నవి. చూడు.

చ॥ విడిముడి గల్గియున్న భుజవిక్రమమెంతగఁ గల్గియుండినన్
జెడుపనినాచరించునెడఁ జేటునుఁగాంతురుమంచిఁ జేసినన్
బడయుదురెల్ల సౌఖ్యములుఫాలతలంబునఁ బద్మజుండువ్రా
సెడునదిగూడ నింతెయనిఁ జెప్పెశుభ్రతిస్మృతులో ధనంజయా
సురాసురులకుఁ గూడనజేయుఁ దవైనివాతకవచాది
దుష్టశిక్షణంబొనర్పమ.

(గౌరీశంకరులంతర్ధానమగుదురు)

అర్జు. చ॥ శిరము పురారిమ్రొక్కుటనుఁ
జిత్తముశర్వునియందు హత్తుటన్
గరములు పూజఁజేయుటనుఁ
గామవిరోధిని; క్రమ్మిందుశే
ఖరుపదముల్ భజించుటనుఁ
గాయము శంకరుదేహ మంటుచున్

బరమపవిత్రి మహ్యోనుభ

వం బెడఁ బాసెను నేఁటితోడుతన్

(తెరలో)

ఓయర్జునా! నీకుదివ్యాస్త్రములొసంగినివాతకవచవధా ర్థమై నిన్న మరాజతికిం గొని పోవుటకు నీతండ్రియగుమ హేంద్రుఁడు దిక్పతులతో వచ్చియున్నాఁడు నేనుకా లుండను. దివ్యదృష్టినొసంగితి నిటురమ్ము.

అర్జు॥ (చూచి) ధన్యోస్మి! ధన్యోస్మి!!

(నిష్క్రమింతురు)

తృతీయాంకము

సమాప్తము





# ॥ అర్జున విజయము ॥

## చతుర్థాంకము

(వియన్మార్గమున రథారూఢులై మాతలియు నర్జునుండును ప్రవేశ)

అర్జు. అయ్యా! ఈదివ్యస్థలంబుల వేరువేర నిరూపించిచెప్పుడు

మాత. చెప్పెదవినుము. (కేలంజూపుచు)

సీ॥ ఈయదే! కనకాచలేంద్రరాజము దేవ
పతులకెల్ల రకునుంబట్టుకొమ్మ
ఈయదే! వేలుపుటేఱు జాహ్నవిసర్వ
కలుషహారంబు సౌఖ్యప్రదంబు
ఈయదే! పారిగ్ద్రశాఖి శుభదరిగజంబు
సౌదంతి యిభవతంసమ్ముసుమ్ము
ఈయదే! సర్వదేవేప్సితార్థదమైన
కల్పభూరుహము భాగ్యములపంట

గీ॥ అదియె! దేవేంద్రనందనోద్యానవనము
ఈయదియె! పారిజాతమహీరుహంబు
అదియె! పాకారిధవళాశ్వమిదియువజ్రి
కాపురంబుండు నమరావతీ పురంబు

అర్జు. ఎట్టిమహామహులకైన దుర్లభంబులగు నీదివ్యస్థలంబుల మీయపారకరుణాప్రసారమువలనఁగాంచిధన్యుఁడనైతి

మాత. ఈదివ్యస్థలసందర్శనమునకుమీపూర్వజన్మకృత సుకృతాతిశయంబె కారణము. అదిగో! కలధౌతమయంబై వజ్రికందళ దేదీప్య మానంబైనందనారామ మధ్యంబున నేతోత్సవంబొనర్చు నాచంద్రశాలంజూడుమందునిర్జరేశ్వరుండప్పుడప్పుడు శచీమహాదేవితో విహరించుటకు విచ్చేయుచుండును.

అర్జు. అయ్యా! జాబిల్లింగేలిసేయుచున్న యీకనక సౌధంబులెవ్వరెవ్వరివో? వివరించిచెప్పుము.

మాత. గీ॥ అదియెపాకారి ప్రాసాద మదిపులోమ
జావరోధంబు సుమ్ము; జయంతసౌధ
మిదియె;యూర్వశిశుద్ధాంతమిది; మహాత్ము
లైనపుణ్యుల సౌధంబులవియెపార్థ!

అర్జు. అనేకులైన బిడౌజులోయనఁ గనకరథంబులెక్కి- సురగణపరివృతులై మహావైభవంబున విలసిల్లునమ్మహాత్ములెవ్వరు?

మాత. ఆయుష్మంతుఁడా!

సీ॥ క్షామంబులో బీదసాదలకేవేళ
 నండయైయున్న పుణ్యుండితండు
తల్లిదండ్రులభక్తి; దయసోదరులఁ
 బిన్నతనమున బ్రోచినయనఘుఁడితఁడు
అపరాధ మొనరించినట్టి వైరులనాజి
 శరణన్నఁ బ్రోచినసజ్జనుఁడితండు
ధర్మంబునాల్గు పాదంబులనడపించి
 వసుధనేలిన చక్రవర్తియితఁడు॥

గీ॥ ఖండనంబున నీల్గినవాఁడితండు
అర్థిజనకల్ప ధరణీరుహంబతండు
దేశహిత దీక్షనుండిన ధీరుఁడితఁడు
ఆడితప్పనియట్టి పుణ్యాత్ముఁడతఁడు

నిన్నుంజూచుటకైగాఁబోలు దేవతలెల్లరును మనరథంబు చుట్టు గుమిఁగూడుచున్నారు. సుధర్మామధ్య హేమసింహాసనంబునం గూర్చుండి సురగణ పరివృతుండై మనరాఁకకెదురుఁజూచు మీతండ్రినిదర్శింతమురమ్ము.

(నిష్క్రమింతురు)

అమరావతీసౌధము.

(అర్జునుఁడువిషాదముతోఁ బ్రవేశించును)

అర్జు. ఆహా! కాలమెట్టి విపరీతపుమార్పులను గలిగించుచుండును?

చ॥ అతులధనుర్విశారదు లటంచుఁ బ్రతిష్ఠ వహించినాఁడుభూ
పతులు "సెబాస" నందగిన బాహుబలంబులుగల్గియుండినం
తతమును న్యాయ మార్గమున ధాత్రిఁ జరించెడి మాకె సిగ్గులీ
గతిఁ జనుదెంచె నెంతయును కాలమహత్త్వముగాదె చూడఁగన్

అకటా! న్యాయమునకువిరోధులగాన సర్వసర్వంసహా చక్రంబవక్రవిక్రమక్రమంబునం బాలించుచు మండలేశ్వరు లెల్లరుసేవింపఁగనక సింహాసనంబునంగొలువుండవలసిన ధర్మస్వరూపుండగు ధర్మజునకురాఁదగినయిక్కట్టులా? యివి. (స్మృతి నభినయించుచు) భ్రాతృవత్సలులగు మత్సోదరులవీడి యిప్పటికేడువత్సరంబులగుచున్నవి. కానివారిసేమమిసుమంతయు గోచరముగాదు. కటకటా! నాబోటిపాపాత్ముండెందేనిఁగలఁడే?

సీ॥ పట్టెడన్నమునకై పరులకొంపవసించి
దినములుగడపు తల్లినిఁదొరంగి
విగతసామ్రాజ్యులై వివిధవిపత్పరం
పరలనుఁబొందు సోదరులఁబాసి
కనకసౌధంబులఁగనకమమ్ములఁగొల్వ
వనికినేతెంచు ద్రౌపదినివీడి

అఖిలసంపదఁ బాసి యడవుల మావెంటఁ
జనుదెంచు భూమినిర్జరులవిడిచి
గీ॥ రాధసుతుఁడాచరించు పరాభవమున
కల్లనాఁడు పిన్న పెద్దలు గలయట్టి నిండు
సభనుఁబల్కిన యాప్రతిజ్ఞలనుమఱచి
సౌఖ్యములనందుచుంటి నీస్వర్గమందు॥

కాలముచాలిపారనివేళ నెంత బలమున్నను నట్టి దివ్యాస్త్రములున్నను నిష్ఫలమేకదా? (తలయూఁచి) నిష్ఫలమేలయాను? ఔను? కానిఁబో! ధర్మసంభవుని మహీతలంబునకెల్ల సార్వభౌమునిగనొనర్చు నిదామాత్రద్వితీయుండై సురాసురులనుగూడ గజగజ వడఁకింపఁగల భీమసేనునితోఁడను, సమర విశారదులగు కవలతోఁడను, నిప్పార్థుండురుల బడినసింగమువలె శరభశార్దూలాది క్రూరసత్వంబుల మధ్యదుర్గమాటవులలో దిక్కులేక చరియించునవస్థ సిద్ధించునా? హంసతూలికా తల్పంబున శయనింపవలసిన కుసుమ కోమలియగు ద్రుపద నందన కఠిన శిలాతలంబులఁ బవళించుచు దుష్టమృగారవంబులకులికిపడవలసినగతిఁగలుఁగునా? అన్నిటికంటెనిలువెల్లదహింపుచున్న నీమాతృవియోగాగ్ని తటస్థించునా?అకటా.! కామ్యకవనంబున వారట్లవస్థఁబడుచుండ నీసురలోకంబునఁ నాకంటికి నిదురపట్టునా? ఇఁక నేనిమహేంద్రు నాజ్ఞఁగొని నివాతకవచుల వధియించి త్వరితముగ మత్సోదరుల కడకేగెద

(అంతట నూర్వశి ప్రవేశించును)

ఊర్వ. ఇదియే! పార్థుఁడువసియించుసౌధరాజము. ఈకనకసౌధాంతరమునుండి వచ్చు ధాళధళ్యంబులే విజయుండిందుఁగలఁడని చెప్పకఁ జెప్పుచున్నవి. అయిన నతఁడెందుండెనో పరికించెద. (అటునిటుఁజూచి) ఇదిగో! ఈగదినుండియపూర్వ తేజోవిశేషంబొంటు వెలువడుచుంట చేతప్పక నప్పార్థుండిందేయుండు (తొంగిచూచి) ధన్యాస్మి! మనోహరుండేది యోఁడిగ్గాలో చనతత్పరుండై యున్నట్లుఁ గనవచ్చెడు

సీ॥ దివిజులఁదోలి ఖాండవమును బావకా
ర్పితమొనర్చిన బలోద్ధతుఁడితండె
స్మరశరాహతిఁదూలు సారసాక్షినులూచిఁ
గాఁచినదయావన్నకాఁడితండె
కాయజారాతి నెక్కటి పోరమెప్పించి
పాశుపతమ్ముఁగొన్న బలుఁడితండె
వీరాహవమున నంగారపర్ణునిచిత్ర
రథునిఁజేసినమహారథుఁడితండె

గీ॥ గురునకై ద్రుపదక్షితీశ్వరుని నంటఁ
గట్టితెచ్చినబాహు విక్రముఁడితండె!
భావజునకోడి చిత్రాంగదావధూటిఁ
గొనిన పాండ్యేశ్వరుని పెండ్లికొడుకితండె!

హా! ఈ సౌందర్యమేమి?

శా॥ ఈరాజేంద్రుఁబోలు పూరుషుని నేనీరేడులోకంబులం
దారా? చూచియెఱుంగ నెన్నఁడును; నీహాసాస్యమీమోహనా
కారంబీయెలఁ బ్రాయమీసొగసునీ గాండీవికేగల్గు న
య్యారే? బారలఁగొల్వ నానురమునాహా! యెంచఁగాశక్యమే?

చ॥ కలువలఱేనిఁ బోల్చెదరు గానికళానిధి యాటనెమ్మొగం
బుల; కతఁడేలసాటియగుఁబో? యదిదబ్బర యీకిరీటిము
ద్దులవదనంబుఁగాంచినవిధుం డెవఁడమ్మకచెల్ల? యాతనిన్
నలువసృజించె; నెన్నియొదినంబులు కష్టములందిచేర్పునన్

గీ॥ వారిజమ్మృగాంకు లీతనివదన మునకు
సాటిరాఁబంతమిడియుండ [illegible]
కప్పుచేసాటిరాఁడయ్యె. గాన; వారి
భవములెనయయ్యె! నిదియెత్త్వైరమిలను॥

ఉ॥ చక్కనివాఁడటంచు నెరజాణయటంచును నెంచుచుందురా
చక్కెరవిల్తు; వాఁడితని చక్కఁదనంబున కెందుసాటియా?
నక్కసుఁదీర నక్కరటి నక్కట! నిక్కడగింప కుందునే?
యక్కునఁ జేర్చివశ్యతనహా! యితఁడించుక గారవించినన్

గీ॥ నిరతమునుఁజూడమే? నరగరుడసిద్ధ
చారణోరగ యక్షకుమారవరులఁ
బోలురే? వీనినీనవమోహనాంగుఁ
బొంపొసర్చెడుసతి యెంతపుణ్యవతియొ?

ఇఁక సమీపమునకేగి మన్మనోభీష్టమెఱిఁగించి యీరసికవ

రుంగూడిమారసుఖంబు లనుభవించెదగాక. (కొంచెమునడచి మరల వెనుకకుఁదగ్గి) ఒకవేళ నన్నీతఁడు గౌరవింపనిచో నా గతియేమి? పరాభవాగ్నిమ్రిందవలయునేకదా? (యోచించి) ఏమీ! నాయవివేకము?

సీ॥ చేపట్టఁగాలేదె? గోపసూనులఁద్రోలి
బవరమందున నాసుభద్రకాంతఁ
గవఁగూడఁగాలేదె? కడువేడుకనులూచి
నాఁజెలంగెడునొక్క నాగకాంత
స్వీకరింపఁగలేదె? చెనఁటిమీనంబును
సమయించినాఁడు పాంచాలకాంతఁ
గూడియుండఁగలేదె? కూర్మిఁగాయజకళా
పాండిత్యమునఁ గోరిపాండ్యకాంత
గీ॥ నట్టిరసికావతంసుఁ డిప్పట్టునందు
నన్నుఁగామింపకేటికి మిన్నకుండు
వెట్టితలఁపుల విడనాడి వేఁగనేఁగి
కామసౌఖ్యంబులందృప్తిఁగాంతుఁగాక॥

నేనీశనిస్సంశయముగ నేగవచ్చును. (అర్జునునిసమీపించును)

అర్జు. (చూచితనలో) ఓహో! ఈయమ యూర్వశి. యీ మెనాకుఁదల్లిగదా! నమస్కరించెద. (ఎదురేగి ప్రకాశముగా) జననీ? నమస్కారము. శ్రమయనకనా క్షేమ మరయనేతెంచినందున కౌంతేయు సంతసించితి. దయచేసి యిటనాసీనవగుము.

ఊర్వ. (తనలో) ఈతఁడు పెడమార్గమున్దొక్కుచున్నాఁడు. కానిమ్ము? ఈతనిముగ్ధతఁబాపిలోఁబఱచుకొనియెద. (ప్రకాశముగా చిఱునగవుతో) పార్థా! అతనుసుఖంబుల నోలలాడెదవుగాక. వచ్చినదానను గూడకుండునా?

గీ॥ "జననిరో!" యంచు వక్రిభాషలనుబిల్వఁ
జనునె? నిర్జరలోక వేశ్యలము మేము
వావివరుసలుమాకేల? పార్థ వేంద్ర!
ఎఱుఁగవో? రోవెలందులనెన్నఁడేని॥

అర్జు. (తనలో) ఏమిది? ఈమెనోటనుండి [illegible] విపరీతవాక్కులు వెలువడుచున్నవి. ఈపల్కులు [illegible] మరుద్దేశ్యముతో మాటలాడుచున్నట్లు తోచెడి. [illegible] శముగా) జననీ! తల్లిని దల్లియని సంబోధించవలదా?

ఊర్వ. అర్జునా! నీరసికతసంతయునొక్క సారిగ బయల్పరచుచుంటివా? ఇదిగో! "చల్లకువచ్చి ముంతదాచనేల"

క॥ పలికెద వినుము ముఖాముఖి
వలచితినిను మరుఁడు దమ్మివాలుంగొనిన
న్నలయిచె జిగిరకరినా
తులువననింగెలువ నాకుఁదోడ్పడుమింకన్॥

గీ॥ ధర్మదూష్యంబటంచును దలఁతువేమొ?
రమణులందుననిదియ ధర్మంబుపార్థ!

విషమ శరశిలీముఖ పాతవివశలైన
కామినులఁగూడుకంటె సౌఖ్యంబుఁగలదె?

అర్జు. (చెవ్రులుమూసికొని) శాపముశమించుఁగాక. (ఊర్వ శితో)

గీ॥ హరిహరి! ఎట్లు మాటాడితివొకట! నీవె
తల్లిరో! యిటుబల్కుట తగునటమ్మ
చూచితివె? యెందునేనియుసుతులఁగోరు
కామినుల, నింతపాపంబుఁగలదె? యెందు

చ॥ పరసతిఁగోరుటే యధికపాతకమందురు పెద్దలందు, నీ
వరయఁగమాతృదేవతవహో!యిటుబల్కుట న్యాయమౌనె? నీ
వెఱుఁగని ధర్మవృద్ధిగలదీ సచరాచరజంతుకోటిలోఁ
గరుణమొకింతఁగన్పఱచి కావుముతల్లిరొ! నీకుమ్రొక్కెదన్

ఊర్వ. మనోహరా!

గీ॥ "జనని" యంచు వచించెదుచాలుఁజాలు
నీకునేనాఁటితల్లినో? నీవచెప్పు
మింతయేటికి వరుసలనెంతురొక్కొ?
కాములచెంత రసికులెక్కాలమునను॥

మఱియును

గీ॥ రసికుఁడవటంచు సౌందర్యరాశివంచు
వినుత శౌర్యుండవంచు మున్వినినదాది
నెపుడునినుఁగాంతుమరుగెల్చుటెప్పుడంచు

గుటకలను మ్రింగుచుందు నీకొఱకుపార్థ!

అట్టి నన్నన్యాయముగ నిర్దయుఁడవై నిరసించుట యెట్టిపాడియో? నీవే యోచింపుము.

అర్జు. తల్లీ! తొల్లిమావంశకర్త యగు పురూరవునకుం బత్నివగుటచేతను, ఇప్పుడు నాతండ్రియగు యింద్రునకుఁ బరిచర్యనొనర్చుటచేతను, నాకుఁదల్లివగుటకావంతయు సందియములేదు

చ॥ తనయునిఁగోరెనూర్వశి యధర్మముగానదినన్ను; గోరినం
తనెయిది కూడదంచనక తాలిమిఁదూలనటించునన్ను, భూ
జనములుదిట్టుచుందు రితుచ్ఛసౌఖ్యముకైయిటుమాయనట్టినిం
దనుభరియింపశక్యమె? వితర్కముసేయుము నీవెతల్లిరో?

ఆ॥ నూఁతిలోననుండి రాఁతిఁదీసెడు
కరణిఁగీర్తిఁగనుట కష్టమగును
గాని, రాఁతినూతిలోనికిద్రోయున
ట్టపయశంబుఁగాంచుట శ్రమంబె॥

ఊర్వ. (తనలో) అకటా! ఇతఁడు తనమార్గము విడుచునట్లు లేడు. లేనిచో నీమారశరాగ్ని కోర్వఁగలనా? మేనకాదిచెలుల యెదుట రేపు తలయెత్తఁగలనా? కానిమ్ము సర్వవిధములఁ బ్రయత్నించియే చూచెద. (ప్రకాశముగా) అర్జునా!

ఉ॥ ఇంతటి యీవిరాగిమెటకేగెనొపార్థ! యులూచికాంతనే
కాంతమునందుఁగాయజవికారమునన్ వరియించునాఁడు నీ

పంతముమానుమింక మరుబారికినోర్వఁగఁజాలనన్నిఁకన్
వంతలపాలు సేయకుము భావజపుష్పశరాగ్ని మ్రందితిన్॥

చ॥ వరుసలనెంచ నేమిటికి వారసతీమణువేల? ఎందఱెం
దఱుకులకాంత లివ్విధినొనర్పరు మారసమానరూప! ము
న్నరయఁగ శౌరిఁగూడ రె?వ్రితాంగనలయ్యును గోపకాంతలా
గిరికుచలందునింద నపకీర్తి వహించిరె? నీవెఱుంగవే?

సీ॥ కన్నకూతురటంచుఁగనియెనే! ధర్మంబు
భారతీ సతిఁగూడుపద్మజుండు
తపసికాంతయటంచుఁదలఁచెనే! యాయహ
ల్యనుఁబొందివట్టినీయనుఁగుఁదండ్రి
మేనత్తయంచును మిన్నకుండెనె? రాధ
వలచికీడించు నీబావగారు
గురుపత్నియంచు గైకొనకుండెనే? తార
సద్వర్తనుఁడు పంకజాతవైరి

గీ॥ శూలిమేదారు కావన స్త్రీలఁగూడి
మారసౌఖ్యంబులందడే! వీరికంటె
ఘనుఁడవేనీవు? వీరునీకంటెహీన
మతులె? ధర్మువెఱుంగరే? సతులఁగూడ॥

అర్జు. (తనలో ఏవముతో) కటకటా! ఈమె నన్ను పుత్రి
వాత్సల్యంబున గారవించుననియుఁబరిశుద్ధాత్మయని

భావించితిఁగాని యిట్టి కలుషచిత్తయని యెన్నఁడును దలంపనైతి ఛీ! ఛీ!! ప్రపంచమున నీచారస్త్రీలకంటె దుర్మార్గులితరులుండరు. కానిమ్ము? ఈమెతోఁ బెక్కు పల్కులేల? (ప్రకాశముగా) జననీ! మహాత్ములును వందనీయులును నగువారు పుట్టింపను గిట్టింపను సమర్థులగుటచె నెట్లుఁజేసినను జెల్లు. నేనో? కర్మచేత భూమిం జనించిన మానవుఁడ నగుటచే నిర్వహింపఁబడలనసామర్థ్యుఁడ నగుచున్నవాఁడను. మదగజముం గంఠీరవము గూల్చునని నక్కయుఁ గోరుచుంట యుక్తమే?

ఊర్వ. (నవ్వుచు) ఆహా! నీపాండిత్యము మేలు! నీవేమో ధైర్యశాలివనుకొంటి. నీయనుమానముం బాపెద వినుము. ఇప్పుడు నేను జెప్పిన వారికంటె నీవును మహానుభావుఁడవే. తొల్లి బదరీవన తాపసులగు నరనారాయణులను ఋషులందు నీవు నరుండను మహాత్ముఁడవు. భూభారహరణార్థమై యవతరించితివిగాని ప్రకృతినరుండవు గావు గావున నికనేని సందియము విడి నన్నానందింపఁజేయుము.

అర్జు. తల్లీ! అటులైనను నీతండ్రి నారాయణుండగుట వలన నీవు నాకుఁ గుమార్తెవగుదువు, క్షమింపుము.

ఊర్వ. పార్థా! ఇది తగునా? నీవుపేక్షించిన మరుఁడుపేక్షించునా? నీగౌరవమునకుఁదగనా? క్షమింపవలసినది నేనా?

అర్జు. తల్లీ! ఇది తగునా? తల్లీయని సంబోధించుచుండమరల నన్నుఁ బలుకుటనీతియే?

ఊర్వ. (తనలో) ఔరా! ఇట్టిమనోహరాకారు మనంబింతకఠిన శిలాసదృశంబుగ నొనర్చిన నప్పరమేష్ఠి మౌర్ఖ్యము నేమన నలయు. (ప్ర) మూర్ఖా! రాయియైనఁ గరఁగుఁగాని నీమనంబు కరుఁ గదుగదా? సురాసురులకేనియుదుర్లభంబగుతరుణీమణి మనోజ తాపతప్తయై తనకుఁదానరించివచ్చుచుండ "సిరిరామోకా లొత్తినట్లు" వానివమ్ము సలెంచి తిరస్కరించుటతగునా?

అర్జు. మాతా! మాబోంట్లకుబుద్ధిఁగఱపవలసిన నీవే "కంచె యే చేనుమేసినట్లు" ట్టియకార్యమునకు సాహసింప లోకమం దే స్త్రీ భర్తతో కాపురమొనర్చును?

గీ॥ చారుగంధ పరిశోభిత చందనాగ
మహీవృతంబును వర్జితంబగువిధమున
నఖిలభువనైక మోహినియగునుగాక
నెలఁది పరకీయయైన నస్వీకృతయగు॥

ఊర్వ. (కోపముతో) ఏమీ? నీయాగడము. సరసముగ నేనిన్నిష్టపరుపనెంచి యింతసేపటినుండియుఁబ్రతిమాలు చున్నను మూర్ఖతవిడువకున్నావుగా?

గీ॥ పైకి "శ్రీరంగనీతులు" బలికినంత
నేకపత్నీవ్రతుండవయ్యెదవె? యొక్క

సరసిజాననకై రాజసంబువీడి
అర్జునా? నీవు సన్న్యాసివగుట వినమె?
ఔను. ఇదిమాజాతికిఁ గలగుణమే
చ॥ తరుణులె కోరివచ్చునెడఁదప్పక చుల్కనఁజేసి పూరుషుల్
వరుసలు వావులుఁ వెదుకవత్తురు, వారలెకోరివచ్చినన్
వరుసలుగాకపోయినను వారిజనేత్రిలమోసగించిపో
దురుతమకోర్కెఁదీర్చుకొని; ధూర్తులుగారె? తలంపఁబూరుషుల్
అర్జు. తల్లీ! ఇన్నిమాటలేల? ప్రాణం [illegible] ప్రాణములనేని వీడుఁ
గాని డాంబికములకుం [illegible] ధర్మ [illegible] మాత్రము విడువఁడని
మున్మాటికిఁదలంపుము. [illegible] యము
గీ॥ అంతటి మహాను[illegible]వుని యాత్మజవయి
సకలవేదపురాణశాస్త్రములుజదివి
తనయుఁగామింపఁదగునె? శాంతమువహింపు
మమ్మ, వినుమమ్మ, ధర్మమార్గమ్మటమ్మ!
మానినులగు స్త్రీలకీ జారత్వంబెట్టి బెట్టిదంపుపనియో?
యోచింపుము
సీ॥ పరపూరుషునిఁగూడ నరుఁగుచోనేవేళ
బెరకంటఁబడకుండ నరుఁగవలయుఁ
బెరకంటఁబడెనేని భీతిఁద్రోపఁగనీక
[illegible] మాటలుబన్నవలయు
సరివారు వినిరేని [illegible]వఁగను న

ల్గురిలోనఁ దలవంచుకొనఁగవలయు
కర్మంబుజాలక కాంతుఁడేవినె నేని
బానింబుల౦ దాశనదలవలయు॥

గీ॥ బంధువులువిన్నఁగులములో బహిరయొనర్తు
రిరుగు పొరుగులవార్వివి రేని! నీటి
కంటెనెంతయొ పలుచగాఁగాంచుచుందు
రమ్మరో! కాంతజారిణియగుటఁదగునె?

ఊర్వ. (కోపముతో) ఏమీ! నీవేదాంతము నీవేమోరసికుఁ
డవనియెంచివచ్చి నిష్కారణముగఁబరాభవము పాలైతినే, నే
నెవ్వతెఁగా భావించితివో? చూడుము

కం॥ మరుబారికోడివలచిన
తరుణీమణిఁద్రోసితిక దత్ఫలముగనీ
సరివారలేవగింపఁగ
ధరషండుఁడవైచరింపు తరుణులమధ్యన్॥

(నిష్క్రమించును)

అర్జు. అకటా! ఈయూర్వశి

చ॥ తనయుఁడటంచునించుకయుఁదాలిమిలేక లతాంతబాణవే
దననుఁగోరఁగాఁదగునె? దావిబుధాంగనయయ్యుఁ గోరెబో?
జననిరో! కూడదంచనిన సైచుటమానిశపించెఁగా! ఇసీ!
వనితలడెందముల్ దెలియవచ్చునె? యెంతటివారికేనియున్

చ॥ అనయము సత్తమానులను నారడిసేయక జీవితేశుపైఁ
గినుకవహింపకెత్తరి సత్కృతిప్రియభక్తి భజించుచున్ సదా
వినయముతో మెలంగుచు వివేకమునన్ బినపెద్దఁగాంచుచున్
గుణవతియైన కాంతయొనఁగూడుట ప్రాగ్భవపుణ్యమేకదా!

గీ॥ భార్యగుణవతియైనచోఁ బ్రాణవిభున
కదియ! స్వర్గంబులేక గయ్యాళియైన
ననుభవించును భూలోకమందె నరక
మకట! పగవానికేనిగయ్యాళివలదు

(ఇంద్రుఁడు ప్రవేశించి) పార్థా! నీమనోధైర్యమునకెంత
యుసంతసించితి.

గీ॥ భుజబలోద్ధతుండై సర్వభువనములను
వేల్మిడి దురానగల్పిన వీరవరుని
కంటెఁదనచెంతనున్న భీకరబలాఢ్యు
లార్వురఁజయించునాతఁడే యధికుఁడెందు

చ॥ నిరతమునన్ విరాగులయి నిశ్చలబుద్ధిఁదపించు మౌనులే
తరుణులఁగాంచిరేని మదిఁదాలిమిఁదూలుదు రింతయేటికీ
శ్వరుఁడె మహాత్ముఁడయ్యుసుమసాయకు దాడికినోడె, నట్టిశం
బరహరుగెల్చినన్ భువనమాన్యుఁడతండని చెప్పనేటికిన్

పార్థా! నీయింద్రియనిగ్రహము మునీంద్రులకేనిఁబ్రశంసార్హ
ము. ఊర్వశీ శాపమునకై చింతింపకుము. అయ్యది మీ

యజ్ఞాతవాససమయమున మాత్రము నీకావహించు నత్తరిబాలికలకు నృత్యంబుఁగఱపుచుండి వత్సరాంతమున విముక్తుండవయ్యెదవుగాక. అదియుంగూడ మీంగూఢ పరివర్తనమున కనుగుణముగానుండు గాననిఁక చింతఁదక్క సుఖనిద్రింబొమ్ము.

అర్జు. తండ్రీ! అనుగ్రహింపఁబడితిని మీయానతిరీతి దుష్టరాక్షసుల వధియించి నాకైవిచారముండు సోదరులకడ కట్టేఁగెద సెలవొసంగుడు.

ఇంద్రు. పార్థా! నీసోదరులకై బెంగఁబెట్టుకొనకుము. ఈయుదయముననే దేవకార్యంబు సాధింప మాతలి ప్రయుక్తంబగు దివ్యరథంబెక్కి నివాతకవచుల వధియించిరమ్ము. వెంటనే నిన్ను నీసోదరుల కడకనిపెద.

అర్జు. చిత్తము.

ఇంద్రు. ఈరాత్రి కొన్ని దివ్యాస్త్రము లుపదేశించెదరమ్ము

(నిష్క్రమింతురు)

చతుర్థాంకము

సమాప్తము







# అర్జున విజయము



## పంచమాంకము

### ఉద్యానవనము

(కవచాసురుఁడును నతనిభార్య చారుమతియును ప్రవేశము)

కవ. మాధవీలత కొంచెము వాడినదని నిన్ననీవువచించితివి గదా చూతమా?

చారు. (భయమభినయించుచు) ఔను. నాథా! ఔను. దాని కొఱకేగదా! ఈయుదయముననే మీతో నిచ్చటికి వచ్చితిని మాధవీయనఁగనే నాకుభయమధికమగుచున్నది. త్వరగావెళ్లి చూతమురండు.

కవ. ఈవిషయము నిన్నగూడ నీవుభయకంపిత వయియే చెప్పితివి. కారణమ్మడుగఁదలంచియు నీవుదుఃఖింతు వేమోయనియడుగలేదు. దీనికైయింత వగపేల?

చారు. నాథా! అదిపదంపడి చెప్పెదను. ముందచ్చటికరుగుదమురండు.

కవ. సరే (పరిక్రమింతురు) అదియేకదా! ఆమాధవీలత.

చారు.(మూర్ఛిభయకంపితయై) అయ్యో!హా! (స్మృతిఁదప్పును)

కవ. (పట్టుకొని) ఏమిది? ఇంతమాత్రమునకే యచైతన్య మందుచున్నది. (ప్రకాశముగా) సతీ! సతీ!

చారు. (కొంచెము తెలివితో) హానాథా!

కవ. కన్నులు తెరచి చూడుము. స్మృతిఁదప్పితి వేల?

చారు. నీవెవరు? తొలఁగిపొమ్ము.

కవ. పిచ్చిమాటలాడెదవేల? స్మృతిఁదెచ్చుకొని సరిగామా టాడుము.

చారు. (తెలివితో) స్మృతిఁదప్పితినా?

కవ. ఔను. పడిపోవుచుండగాఁ బట్టుకొంటిని. ధైర్యశాలినివే నీకీబేలతనమెప్పటినుండి దాపరించినది.

చారు. (నిట్టూర్పువిడచుచు) హా! యేమందును? ఈమాధవీ లతఁజూచిరా? నిన్నటికంటె నేడెట్లుకళాహీనమై యెం డుటకు సైతముసిద్ధమైయున్నదో?

కవ. ఇంతమాత్రమునకేల స్మృతిఁదప్పితివి?

చారు. (దుఃఖముతో) నేనీమాధవీలతఁ బ్రతికింప నీనాల్గుదిన ములనుండియుఁ బడినశ్రమయంతయు నిట్లయ్యె.

కవ. ఆయుఃకాలము పూర్తియైన వారికొరకెన్ని ప్రయత్న ములుసల్పినను జీవింతురా? ఈమాధవీలత చచ్చినఁజ చ్చుఁగాక. ఇట్టివికావలెనన్న ఒకటికాదు వేయితెప్పించ నా! ఏలదుఃఖించెదవు?

చారు. (మిన్నకుండును)

కవ. చెప్పుము. చేతిమీఁదుగ నీరుపోసి పెంచుకొంటిననియా?

చారు. కాదు. దీనివిషయమై యొకసారి మీతోఁ జెప్పియుంటిని.

కవ. నాకు జ్ఞాపకము లేదు.

చారు. మహాత్ములగు నాచార్యులవారు నన్నీయుద్యానవనమునకుఁ బిలిపించి యీమాధవీలతం జూపి "కుమారీ! ఈమాధవీలత నతిజాగరూకతతోఁ గాపాడుము. అకారణముగ నీలత యెప్పుడు వాడునో? అప్పుడు——

కవ. (స్మృతి నభినయించి) చాలుఁ జాలు. వివేకహీనవే? ఈమాత్రమునకేనా? యింత భయము. సర్వభువనంబులను గడగడ వడంక ఘోరతపంబొనర్చి పరమేష్ఠివలనఁ బడసిన వరంబుల మరచితివా?

చారు. లేదుగాని, యాచార్యులవారి మాటఁ దలంచిన నాగుండె బిట్టద్రుల్లుచున్నది.

కవ. నీవు దానవవంశమునఁ బుట్టవలసినదానవు గావు. తృణీకృత సర్వసుపర్వసార్వభౌముఁడగు నీ దైత్యసార్వభౌమునకు దేవేరవగు నీకు భయమునకు స్థానమే లేదు. ఇఁక నీవిచారము డిగి యొక్కసారి నీదృఢపరిష్వంగసౌఖ్యం బొసఁగుము?

(సమీపమున కేగును)

చారు. (విచారముతో) అయ్యో! మనమిప్పుడాపత్సముద్రమున మునుఁగనుండ సమయమెరుఁగక మీ రిట్లాడెద రేల!

పూర్వమెప్పుడును నాయాసనంబునకిట్టివిచారము గలిగియె
ఱుఁగ. (భయముతో) నాకుడికన్నదరుచున్నది. ఒక్క
సారియాచార్యులవారిఁ బిలిపింపుడు.

(గోముఖుఁడనురాక్షసుఁడు కల్లుముంతతో ప్రవేశించును.)

గోము. మహారాజా! ఇదిగో! తెచ్చితిని.

కవ. (తీసికొని) ఇంతసేపేమి జేసితివి?

గోము. దేవరయానతిరీతి పరుఁగుపరుఁగున వచ్చుచుంటిని గాని
మంత్రిగారియింట్లో నాకస్మికముగ నేడ్పులువినఁబడినం
దున కొంచెముచ్చటనిలిచితిని.

చారు. మంత్రియా! నిశుంభుని యింటనా?

గోము. తల్లీ! అవును.

కవ. కారణము తెలిసెనా?

గోము. మంత్రిగారు నాతోగూడవచ్చి వాకిట నిలచియు
న్నారు. తమతోనిట్లుమనవిఁ జేయుమనిరి.

కవ. ఎట్లు?

గోము. "మహారాజా! నేఁడునాకుమారుఁడు షికారుగా నమ
రావతీప్రాంతమునకేగుచుండ నిందుఁడో! జయంతుఁ
డో! అడ్డుపడి నిష్కారణముగ వధించుటయేగాక మ
నతోఁ గయ్యమొనర్పవచ్చుచుండెననిగూడ గూఢచా
రులు వచించిరి. దేవరయొకసారిదర్శన మిప్పింపవ
లయును." అని—

కవ. (కోపముతో) ఏమీ? ఇంద్రుఁడో? జయంతుఁడో? యని యా? (ఇంద్రునుద్దేశించి) ఆఁ; అప్పుడే యింతగర్వమా? దురాత్మా! సింగములతోనా? చెలిలాట. నేఁటితో దేవలో కంబగీర్వాణంబగుఁగాక. (సేవకునితో) ఓరీ! నేనిప్పు డేవచ్చెద సర్వసైన్యములతో సిద్ధముగనుండుమని

గోము. చిత్తము. (నిష్క్రమించును) [మంత్రితోఁజెప్పుము

చారు. నాథా! దినములుమనకుమంచివిగా గన్పట్టుటలేదు.

కవ. ఎందుచే?

చారు. విచారమనునది యెఱుఁగనినామనంబు దుఃఖసముద్ర మునమునిఁగియుండుటచే;

కవ. ఐననేమనెదవు?

చారు. మీరీసారికిమాత్రమీ దండయాత్రమానుఁడని;

కవ. నిర్భీతిగ మంత్రిసూనునివధించినదుర్మార్గుల శిక్షింపవల దనియా!

చారు. (దీనతతో) ఈసారికి

కవ. ఇట్లనుటకు నీమనస్సొప్పుచున్నదియా? నీవసుర వంశ మునఁబుట్టలేదా?

చారు. మీరింతకఠినముగ మాట్లాడిన నేనేమనఁగలను. నేఁడు మీరెంతఁజెప్పినను మీయీయుద్యమమునకు నామనం బొప్పకున్నది. ఈదీనురాలివిజ్ఞప్తి వినుఁడు. (ఏడ్చును

కవ. (కన్నులనీరు తుడుచుచు) సతీ! ఇంద్రాదుల జయించుట మాకొక లెక్కలోనిది కాదు. ఒకవేళ నీయుద్ధము మానితిమేని లోకమున నెట్టి దుష్కీర్తిపాలుగావలయునో విచారింపుము. ఈమాత్రపుఁబని చేయఁజాలమేని మాబల పరాక్రమములేల? పితామహులొసఁగిన వరములేల? కాల్పనా?

చాయ. మీరు వచించినదంతయు నిక్కమే అయిననిది మనకు సమయముకాకపోవుటచే మారాడవలసె. ఇదివరకెన్నఁడేనియిట్లుఁ బల్కితినా?

వ. ప్రియా! బలవంతులకు సమయాసమయములేల? ఈకార్యము మాదనుకను వచ్చుననుకొంటివా? మనసేనాని యొక్కఁడే సాధింపఁగలఁడు. ఒకవేళ వచ్చినను భయములేదు. ఇదిగో! ఈతియ్యని మద్యమును నీకొరకే తెప్పించితిని. పుచ్చుకొని అంతిపురమున కేగినిర్భయముగనుండుము. (నిష్క్రమించును)

చాయ. (దుఃఖముతో) అకటా! నాథుఁడెంత చెప్పినను వినఁడయ్యె. ఈయశుభంబులకుఁదోడునేఁడే యీమామాయు దారియుద్ధము సంభవించుటఁజూడనాకుఁజాలభయమగుచున్నది. గురువుగారివాక్యములు వృథాయగునా హా!

(మూర్ఛిల్లును)

(తెరపడును)

## అమరావతీపట్టణము.

(ఇంద్ర బృహస్పతులు కొందరుమునులు ప్రవేశింతురు.)

మహే. (విచారముతో) గురువరా!

చ॥ పరమదురాత్మశేఖరులు, బాహుబలాఢ్యులు, తొల్లి నెన్నొసం
గరములనారితేరిరి, విఖండితశత్రులు, మాయయుద్ధదు
ర్ధరులఁ జయింపఁ బేర్వడసినట్టి సురారులపైకి బిడ్డని
న్నరయక ముందువెన్కలకటా! సుతుఁ బంపితి నేనజ్ఞానినై

గీ॥ నాదుప్రాణరక్షణమునకై నాకుమారుఁ
గూర్మివాసినిఁ బంపితి ఘోరకదన
భారమునకోర్వఁ బుఱికొల్పి బవరమందు
జయముమునదాన? చెప్పుఁడాచార్యవర్య॥

బృహ. ఇంద్రా! పార్థునికొరకా? నీవిట్లు చింతించుట

చ॥ జలనిధిఁ గ్రుంక లేదు భువి; చంద్రదివాకర మండలంబులుం
జలజలరాల లేద యుడుసంతతియుం గతిఁ దప్పలేదు ది
క్కులురుచిఁ బాయ వే విధినిఁ గూళనిశాటులచేత పాండవుఁ
డలఁతిగఁ జిక్కు; వాఁడు వివిధాస్త్రధురంధరుఁడం చెఱుంగవే!॥

అదిగో! సంగరరంగంబునుండి కాంబోలు మనమణిగ్రీవుఁడు వచ్చుచున్నాఁడు. (ప్రవేశము—మణిగ్రీవుఁడు)

మణి. నిర్జరలోకపాలా! జయము! జయము!! దేవగురూ! వందనములు.

బృహ. మణిగ్రీవా! చిరంజీవివై వర్ధిల్లుము.

మహే. ఓయీ! యుద్ధము నుండియే వచ్చితివా? అట్లైన కుమారునివిజయవార్త వినిపింపుము.

మణి. దేవా! చెప్పుచున్నాఁడ వినుఁడట్లు దేవరయానతింగొని మాతలిసారథికంబగు దివ్యరథంబెక్కి పార్థుండపరాహ్ణ కాలచండకిరణుండో! యనభాసిల్లి కొంతదూరమరుఁగు నప్పటికొకదైత్యకుమారుండెదురై దురాలాపంబులాడు చుఁగిరీటింగవియ నతనినొకనారసంబున కెరఁజేసి ముహూర్తమాత్రంబున సకలజలచరానీకనివాసంబగు రత్నాకరముంగాంచె

మహే. తరువాత

మణి. అట్లు నీరధిం జేరి తన్మధ్యంబున నున్న దానవపురంబుం గాంచి తన్నగరద్వారంబున శంఖధ్వానంబుం జేయఁ గులమహీధరగుహాకుహరసంజనితప్రతిశబ్దంబై సకలప్రాణికోటిభయంకరంబై గరుడగంధర్వఖేచరసురాసుర వీరులకున్సైతము గర్భనిర్భేద్యంబై యొప్పె. నివాతకవచులమ్మహాధ్వనివిని బెదరిలేచి పట్టరానికోపంబునఁ బరశుశూల ముద్గర భిండివాల కరవాలాది సకలాయుధంబులు గొనియుద్ధసన్నద్ధులై కిరీటిం దాకిరి.

మహే. తరువాత

మణి. అట్లుతాఁకి దైత్యవీరులెల్ల రతి క్రూరంబులగు వివిధాస్త్రంబులు బఱపి నర్జునుండద్దానవుల బాణజాలమెల్లనొక్కొక్కనిమునంబున ఖండించియొక్కొక్కనినొక్కొక్కబాణంబున నీవలినుండి యావలికిదూసిపోనేసె.

మహే. తరువాత!

మణి. తరువాత నోదేవా! అద్దురాత్ములు రెట్టించినకోపంబునఁదమలోఁదాము పోసికొఁదు, పట్టుఁడుచంపుఁడనునిస్వనంబులాకాశాంతములఁబర్వఁ గిరీటిరథ మార్గనిరోధంబుగ రోదోంతరమెల్ల దోమదూరసందు లేకుండునట్లు శరపరంపరలచేఁగప్పిరి.

మహే. తరువాత! తరువాత!!

మణి. అట్లుద్వ్యోమమార్గమెల్ల శరపరంపరలచేఁగప్పుటయురథ్యంబులు పరవనేరకుండుటయుఁజూచి మాతలిభీతిల్లిచేష్టలుడిగి రథంబుపయింబడ విజయుం డిసుమంతయు భీతిల్లక రథమార్గనిరోధంబుగఁగప్పిన బాణములనెల్లఁదుత్తునియలుగావించితానే సారథ్యంబొనర్చుచు త్రిపురసంహారంబొనర్చు నాటి శంకరునివలె ప్రళయకాలదావాగ్నింబోని తనబాణాగ్నిచే నద్దానవసైన్యమెల్ల దైన్యంబునొందింపఁజేసె.

మహే. (సంతోషముతో) బలే! కుమారబలే! దానవులకుఁదగినప్రాయశ్చిత్త ముంజేసితివి. మణిగ్రీవా! తరువాత.

మణి. అవ్విధంబునఁ దనసైన్యమెల్లఁ గృతాంతనిశాంతంబున కేగుటయు నద్దానవేశ్వరుం డర్జునుతోఁ బోరనోపక తనమిత్రులతో నేమేమియో యాలోచించి మాయాయుద్ధము సేయసమకట్టి తమహయభట రథాళితో నాకసంబున కెగసి యదృశ్యుండయ్యె నింతలోమాతలి తెలివిఁ దెచ్చుకొని సారథ్యంబొనర్పఁగడంగె.

మహే. పదంపడి.

మణి. పిమ్మటమేమెల్లరముంజూచుచుండధనంజయునిపైనద్దానవులు పాషాణ వర్షముంగురియింప నతండా రాలనెల్లవజ్రాస్త్రంబునఁదుత్తునియలు గావించె. అయ్యసురులుప్రభంజనయుక్తంబగు నగ్నికణములు బరపపార్థుండు సలిలాస్త్రమున దానినడంచుటయు తుట్టతుదకద్దానవులత్యుగ్రంబైన తిమిరాస్త్రంబేయ నభ్రమండలంబెల్ల నంధకారబంధురంబై సర్వజీవులకు నుకన్నులుండియు నంధత్వంబు సిద్ధించె.

మహే. (భయముతో) తరువాత! తరువాత!!

మణి. అట్లుసకల దిశలును గాఢాంధకారంబులగుటయు దేవసంఘంబులందు హాహారవంబులుప్పతిల్ల దైత్యులెల్లరు సంతసంబున సింహనాదంబులొనర్చుచుండ రథహయంబులు చేష్టలుడిగి తెన్నుఁగానక కళవళపడుచుండ మాతలి యమ్మహా తిమిరముంగాంచి భీతచేష్టుండై

గజగజ వడఁకుచు నర్జునా! అర్జునా!! ఎందేఁగితివెం దేఁగితివి రక్షింపుము! రక్షింపుము!! మున్నెన్నియో కలహంబులం గాంచితిఁగాని యింత భీకరమైన యుద్ధముం జూచియెఱుంగనని మఱిమఱి దీనాలాపంబులాడుచుండఁ గాంచి ఫల్గునుం డప్పటికేనియు ధైర్యంబువిడక గుణంబుసారించుచు మాతలీ! భయంపడకుము! భయంపడకుము!! నీవంటివీరపురుషులిట్లు సంగరరంగంబున ధైర్యంబుఁబాయుటయు నెన్నఁడుంగాదు. మదీయ శౌర్యసాహసంబులిదె వీక్షింపుచుండుము. దుర్మదాంధులును, మాయావులు నగు నిద్దానవులతమిస్రజాలంబెల్ల నొక్కనిమిసంబున నేమయ్యెడునో? చూచుచుండుమని వీరాలాపంబులాడుచు భాస్కరాస్త్రంబుంగొనియేయ నిర్జరులెల్లరును సంతసంబున మైమఱచి "భళిరే! కిరీటీ! విజయుండవేసుమీ!" యనినుతింపుచుండ నాక్షణంబ చీకటియెల్లమాయమై దిక్కులెల్లఁదెలివిబాఱె. తదస్త్రమహాత్మ్యమున దానవులువిగతజీవులై యుద్ధావనింబడిరి. అట్లునివాతకవచులందునిమియతిసుందరంబై సముద్రమధ్యంబున నున్న తద్దానవపురంబుఁగాంచఁగాఁబోలు పార్థుండు సురపురికి మాతలియుక్తముగ వెళ్ళుచుండె. నేనీశుభవార్త దేవరకెఱింగింపవచ్చితిని.

మహే. (సంతోషముతో) లోకైకవీరా! పార్థా! తనయుఁడ
నసీయట్టివాఁడే తనయుఁడు.

చ॥ తనయులుగల్గఁగా సరియె? ధాత్రిని పేరుఁ బ్రబలిష్ఠ నందఁజా
లు! వెయిమంది గల్గిననులాభమె? బాహుబలుండు సజ్జనుం
డా నుతిఁజెందుపుత్రుఁడొకఁడైననుఁ జాలఁడె? యాజిఁ బాఱిపో
వున కడుసేనకంటె నొకఁడేనియు ధైర్యయుతుండు చాలఁడే?

ఉ॥ పౌరుషశాలురన్ దివిదశపట్టణవాసుల బాహుశౌర్యగ
ర్వారులనిర్జరేంద్రులన బారఁగఁద్రోలిన దైత్యసింహులన్
వీరులు మెచ్చ నాఁజి పృథివీస్థలిఁ ద్రుంచితి వీవొకండవ
య్యారె! భవద్భుజాబలమహా! గణుతింపఁదరంబె యోర్కికన్
ఆచార్యా! జయలక్ష్మీశోభితుఁడై వచ్చుకుమారుని గా
రవింతము రండు.

బృహ. మంచిది. వెళ్లుదముపద. (నిష్క్రమింతురు)

---

సముద్రము.

(హిరణ్యపురమునందర్జునుఁడును మాతలియు రథారూఢులై
ప్రవేశింతురు.)

అర్జు. మాతలీ! ఈదైత్యపురముంగాంచుటాది నాకొకసంది
యముగలుఁగుచున్నది. ఏమందువా?

సీ॥ ధరణీమహాదేవి దాల్చిననూత్నహా
రంబునందలి యగ్రరత్నమనఁగ

మున్నిట్టి నాపురంబును రోసి యిందిరా
పతిఁడు నిర్మించిన పురమనంగ
సవతిపోరును మాన్పఁజాలకీశ్వరికిఁబు
రారి నిర్మించిన హర్మ్యమనఁగ
బ్రాహ్మ్యమునుల మోసపుచ్చిన మోహినీ
కాంతాలలామ శుద్ధాంతమనఁగ
గీ॥ శైలబిల శక్రపురముల నధిగమించి
మోహకరమువింతఁగొల్పెడునీపురమునఁ
గాపురంబుండెశ మురావతీపురమున
వాసవుండేలవసియించెనలనాఁకొ!॥

మాత. వినుము

సీ॥ పుణ్యసంభవమొకనాఁడు పూర్వదివిజ
సంగ్రామమున నిందుండసురలకొఱకు
నీపురినివార్ధిలోఁ సృజియింప వరము
లందివిధిచేత నివసించిరిందసురులు॥

అర్జు. వింటివా? ఈపురంబున నెచ్చటఁగాంచినను,

ఉ॥ హాననవమోహనాంగ! ప్రియ! హాసుకుమార! విజేశమున్న నా
ప్రాణసమానులైనమిముఁ బాయఁగఁజాలనటంచుఁ బల్కి నే
డీనడి యేటముమ్మువిడి యేగఁదలంచుట న్యాయమా నె? అ
య్యో! నరుఁడేడదాపరిలెనో? యనిదానవకాంత లేడ్చెడిన్

మాత. పార్థా! ఉత్తమక్షత్రియాన్వయంబునం బొడమియు

నేటికిట్లుజాలిఁబొందెదవు?

గీ॥ అనయమును దుష్టశిక్షణం బాచరించి
చేయుచును శిష్టరక్షణఁ జేయుకొఱకు
భగవదంశంబునను సార్వభౌములవనిఁ
బుట్టుదురటంచు పచియింతురు బుధులు పార్థ!॥

అర్జు. నేనొనర్చినది విశ్వహిత కార్యమైనను రాక్షసాం
గనల దీనాలాపంబు లాలించినంత నీకార్యంబొనర్చినం
తయే మనంబు కలఁత నొందసాగె మఱియును,

చ॥ అనయము వాహినీసహితమై సమరాంగణఁ బేరుఁ గన్న దై
త్యనృపవరేణ్యయుక్తమయి ధన్యతమంబయి యొప్పుచుండు నీ
దనుజపురంబు యీదినమొ! దానవలోక విహీనమై యటచే
కనుఁగొన భర్తృహీనయగు కామిని వైఖరిఁ దోఁచె మాతలీ!॥

మాతలి. (తనలో) ఆహా! ఈతని మానస మెంత పవిత్రమైనది. దుర్మార్గులగు రాక్షసుల వధించి తత్సతులయాక్రందనములు విని జాలిఁబొందుచున్నాఁడు. ఔను! ఇదియే! దయార్ద్రహృదయుల లక్షణము. (ప్రకాశముగా) కిరీటీ!

ఆ॥ క్రూరులైన దనుజవీరులఁ దునుమాడి
వంతఁ జెందు టేటిపాడి యనఘ!
దుష్టబుద్ధి భోగిఁ దుంచి వల్మీకంబు
పాడువడెనటన్న ఫలము గలదె?॥

అర్జు. అయ్యా! ఈరాక్షసేశ్వరులు దుష్టకర్మంబులొనర్చి చే

తిమిాదుగ దుర్మరణముం బెచ్చుకొనుచున్నారు. కానీ
గును సత్ప్రవర్తనముగలవారేమైనయెడల వీరివంశం
బునుతామరతంపరమై యెంతదుర్వారముగనుండునో?

మాత. ఔనుగాని దురాత్ములకుసద్బుద్ధిగలుఁగుట గగనకుసు
మసదృశము. మఱియు "ఎవఁడుతప్పినగోఁతవాఁడు
పడుట"లోకసామాన్యమేకదా? ఈదురాత్ములనెప్పు
టికప్పుడేమహాత్ముఁడో వధియించి లోకశాంతిగావిం
చుచున్నను యిసుకపాతరవలెతరుఁగక యెవఁడోయొ
కదురాత్ముఁడవతరించి సాధుహింస నొనర్చుచునే
యుండును. ఇప్పటికీనివాతకవచులవధయించి మా
బాధఁదీర్చితివి.

అర్జు. మాతలీ! ఈపురమున నెచ్చటఁజూచినను లెక్కకొక్క
పురుషుఁడైనఁ గానరాఁడే?

మాత. ఈదానవులు చాలవరకు భవదస్త్రజ్వాలలభస్మమైరి.
మిగిలినవారు బలినాశ్రయింప పాతాళమునకేగియుం
డనోపు.

అర్జు. ఈస్త్రీలయాక్రందనమువినఁజాల. రథంబుక్రమ్మరింపుము

మాత. అట్లే వెళ్లుదము. (కొంతదూరము వెళ్లుదురు.)

అర్జు. (ముందుఁజూచి) ఆర్యా! దేవనాధునినందనంబుందిరస్క
రించుచు బహువిధకుసుమలతావితానములతోఁ గాన
వచ్చుయీసుందరవనంబెవ్వనిదైయుండును? నిందలివింతలం
జూచిచనవచ్చును. ఇంచుక రథగమనముందగ్గింపుము.

(తేరిపారఁజూచి) ఓహో!

చ॥ అనుపమరత్నరాజసదనాన్వితమై మదికింపుఁ గూర్చుచున్
గనులకువిందుఁజేయు నొకకాంచనపట్టణ మివ్వనంబునన్
గనుఁగొనుమల్లదే! యచటఁగానఁగనయ్యెడి; నద్దియేమహా
త్మునిదగుభాగ్యమో! యనతిదూరమునన్ వచియింపుమాతలీ!॥

మాత. (తనలో) "గాలివచ్చినప్పుడే తూర్పారఁబోసికొనవల యు" నన్నట్లిమ్మహాత్మునిచే నిద్దురాత్ములఁ గూడ నిప్పుడేబరిమార్పింతు. (ప్రకాశముగా) విజయా! అయ్యదిహిరణ్యపురంబనఁబడు. నందుపౌలోమకాలకేయులనురక్షోవీరులరువదివేలమహారథులతోఁ గాపుర ముందురు. ఆపౌలోమకాలకేయులు దేవతలకు సైతమజేయులై నిరంతరమును బ్రాహ్మణహింసాదిదుష్టకర్మంబులొనర్చుచుందురు.

అర్జు. అటులైనవారిపయింబోవుదము. రథముఁద్రిప్పుము.

మాత. చిత్తము. (నిష్క్రమింతురు)

పంచమాంకము

సమాప్తము.





# అర్జున విజయము.



## షష్ఠాంకము.

హిరణ్యపురప్రాంతము.

(గోపాలుఁడు, దినకరుఁడు అనునిరువురు మునికుమారులు ప్రవేశింతురు)

గోపా. బావా! గండముగడచి బ్రతికితిమి సుమా?

దిన. ఆయర్జునుఁడు మనకాపద్బాంధవుఁడుగదా?

గోపా. సందేహమేమి? ఆదయారసముఆధైర్యస్థైర్యములుమఱి యొకరాసుతునకు వేయిసంవత్సరములు తపంబొనర్చి నను వచ్చునా?

దిన. నిజము. నివాతకవచులతోఁ బోరునపుడా రౌద్రమూర్తిం దేఱి చూడఁదరము గాకుండె. దానవులుమాయాయుద్ధమొనర్చుచు సర్వజీవభయంకరంబగుతిమిరాస్త్రం

జేయనమ్మహాంధకారంబునఁ గౌంతేయుండ సురలకుఁ
జిక్కననియే తలంచితిసుమా!

గా. పా. నీవొక్కఁడవు దలంచు టేమి? సర్వదేవతానీకములందు
నుహాహారవముప్పతిల్లె మఱియు

సీ॥ దనుజులడరించుమా యాంధతమసమెల్ల
ఫల్గు నుండర్కశరమునఁ బాపునపుడు
విభ్రమంబున "బాపురే! విజయనీదె
జయమ" టంచును భూతసంచయముమ్రోసె॥

దిన. (ముందుఁజూచి) అదిగో! అర్జునరథం బప్పుడే హిరణ్యపుర
ముం జేరినదే?

గా. పా. ఔను. దానవసైన్యమెల్లను మధ్యమ పాండవుని జుట్టుము
ట్టి నిలునిలుమని యదల్చుచున్నారు. దానికర్జునుఁడే
మనునో? విందము. (తెరలో)

ఓ దైత్యులారా! అగ్నిండాయుశలభంబులవలె యేటికి
ట్టుచుట్టుముట్టెదరు.

గీ॥ పొగరుచేమెక్కి బెద్దాల బోతుమీద
రంకవైచెడురీతి దుర్మార్గులార!
సాహసంబున నాతోడ సంగరంబుఁ
జేయనుంకించుటిదియేటి చేటుమీకు

ఓ దైత్యాధిపా! బ్రతుకఁదలంచితివేని నాహితవాక్యము
లాలింపుము.

కంఠంబుల గుదులుగుదులు గారాల్చుచున్నది. ఔరా! దానవులింకేమి చేయుదురు. అదిగో! బెబ్బులిం గను లేళ్లగమింబలె నర్జునుని శరపరంపరలకోర్వఁజాలక దానవులెల్లరును నలుదిక్కులఁ బారుచున్నారు. పాపపో దైత్యసైన్యముం గెలిసేయుచు విజయుండేమియో పలుకుచున్నాఁడు. (తెరలో)

ఓ దైత్యవీరులారా! ఇంతకుమున్ను బలికినపౌరుషోక్తులు మరచి మీ పరాక్రమ మేటికిట్లుటఁగలుపుకొనియెదరు.

ఉ॥ అచ్చపువీరలక్షణమె? యాజినొనర్చుచుఁ బాఱిపోవమీ
రిచ్చటనుండియేగఁగ నెమృత్యువుఁదప్పునె? యెన్నఁడేనియున్
జచ్చెడువారమే కద! అశాశ్వత మీతనువంచెఱింగియీ
మచ్చునఁబాఱి పోవనవమానము గాదొకొ? దైత్యపాళికిన్

గోపా. పార్థుని పలుకులకు సైతము తిరుగక పారుచున్న తన సైనికులఁ బురిగొల్పుచు నర్జునునిపై కేగుచున్న యపౌపలోముని పల్కుల విందము.

(తెరలో)

సైనికులారా! వంటయింటికుందేలగు సీతనింజూచి యేటికిట్లు భీతిఁబొందెదరు.

చ॥ జడియఁగనేల? నేగలుఁగ సంగరమందమరారులార! నే
నడఁచెదపార్థు శౌర్యవిభవాతిశయంబిటు లాజిధైర్యమున్
విడచితొలంగ మిమ్ముఁగనివేల్పులునవ్వరె? పార్థుఁజంపెద

ప్పుడ చనుచున్న వాఁడనిఁకఁబోవకరండని సేయధీరతన్
ఓసరాధమా! పోకుపోకుము.

గీ॥ విజితహరిదీశ్వరుండనై వెలయునేను
గలుఁగ సైన్యంబుపైనేగఁగలవె? పార్థ!
వచ్చుచుంటినినేనె నాపైనఁజూపు
బాహుబలమునునీదగు పౌరుషంబు

దిన. దీనికర్జునుఁడేమనునో?

(తెరలో)

ఓరీ! మామిత్రులగు నివాతకవచులిదివరకే చాలదూర మరిగి యుందురు. ఆలసించితివేని వారింగలిసికొనఁ జాలవు. త్వరగారమ్ము.

గోపా. సవ్యసాచీ! బళే! బాగుగ ప్రత్యుత్తరమిచ్చితివి.

దిన. ప్రత్యుత్తరమిచ్చుటయేగాదు చూడుమప్పుడేయద్దానవు రథాశ్వసూత కేతనంబులతో నాతనియుత్తమాంగము ధరాతలంబునకు బలియొసఁగుచున్నాఁడు.

గోపా. తనసోదరుంగూల్చుటచేఁగాఁబోలు కాలకేయుండుదం దశూకమహోరగంబుపగిది మండిపడుచుఁ గిరీటిం దాకుచుండె. తనతోఁగయ్యమొనర్పనేతెంచు కాలకేయునితోనర్జునుండేమేమియో పలుకుచునిటువచ్చుచున్నాఁడు మనమాప్రక్కనుండి వీరిసంభాషణము విందమురమ్ము.

(నిష్క్రమింతురు)

## యుద్ధభూమి



(కాలకేయుఁడు నర్జునుఁడు మాతలియుఁ బ్రవేశించుతురు.)

అర్జు. (తనలో) కోపమా! ఒక్కింతకాలము నాచెంతకురాకుము. ఈతఁడుకడుమూఢుఁడు. వీనింజంపుటొకపౌరుషముగాదు. (ప్రకాశముగా కాలకేయునితో)

ఉ॥ కన్నులులేవా! నీయెదుటఁగాండివముక్తశరాగ్నిఁబూదెయై
యున్నమదాంధులఁగనవా? యూరకపేలెదవేల?

కాల. (కోపముతో) మానవా!
చెన్నటిపల్కులీయసురుచెంగటఁజెల్లునె? మచ్ఛరాగ్నినా
పన్నగశాయివచ్చినను భస్మమొనర్చినినున్ వధించెదన్॥

గీ॥ భయదరిపుమృగకంఠీరవంబనైన
మద్భుజాపంజరంబునంబడి తొలంగ
వశమె? ఫాలాక్షునకునేని పార్థ! నీదు
"ఉడుతయూపుల" కెవ్వరుజడియరిచట॥

అర్జు. (తనలో) ఏమీ? వీనియహంభావము. కానిమ్ము! ఈయొక్కసారిచెప్పిచూచెద. (ప్రకాశముగా) దురాచారా! నావిడంబికవచనములుగపరిణమించెనా? ఇట్టిమూఢాత్ములుగనుకనే మీకు బలవన్మరణము సిద్ధించుచుండును. "వినాశకాలేవిపరీతబుద్ధి" యనునార్యోక్తినిత్తయగునా?

కాల. (కోపముతో) ఓరీమనుజా!

కవిరాజవిరాజితము.

గడబిడసేతువిదేటికి బీరముగల్గిన రమ్మనిలోపలన్,
నుడుకుతనంబడఁగింతుక్షణంబునదుర్మతి! మాటలికేటికి

అర్జు. (కోపముతో) నిక

పిడువఁగరాదిఁక గర్వమడం చెద వెంగలి! పారకనిల్వుమనిన్
గడువడిఁబం పెదనీప్రియసోదరుఁగాంచఁగ నెక్కటినీమమములోన్

కాల. మనుజా! కడ తేరితివి. (శరముప్రయోగించును)

అర్జు. (ఖండించుచు) దానవా! కాచికొనుము.

(అనిశరముఁబ్రయోగింప దనుజుఁడుపురముతోఁగూడమాయ
మగును.)

అర్జు. (దెసలుపరికించి) ఏమిది?

గీ॥ రజనిచరనీచ! విజితశాత్రవుఁడనంచు
బీరములుపల్కితవియెందుఁజేరెనోరి!
నీపరాక్రమ బలము లేనీటఁగలిసె,
పందపోలిక నిటులాజిఁబారితేర!॥

(రోషముతో) దురాత్మా! దైత్యాధమా! పాండునందన
మనితోఁ బోరుటయునినసమరభీరువులగు నిర్జరులనిర్జిం
చుటగాఁ దలంచితివా? లేక సాధుల హింసించుటగాద
లంచితివా?

మాత. ఆయుష్మంతుడా! త్వరపడక పరిసీలింపుము. వాఁడు పాఱిపోలేదు. మాయాయుద్ధవిశారదుండగు నద్దానవుండు మాయాయుద్ధకౌశలముననే మనలజయింపఁదలచి తనపురంబుతోఁగూడ దివంబునకెగసియదృశ్యుఁడయ్యె. చూడుము.

అర్జు. (ఆశ్చర్యముతో) ఏమీ? ఈవింత! (స్మృతినభినయించుచు రోషముతో) కానిమ్ము. ఇద్దురాత్ములమాయ లెల్ల నివ్విధముగమాయించెదఁగాక. మాతలీ! ఈదైత్యనికృత్రిమవ్యాపారంబులెల్ల నొక్కనిమిసంబుననేమయ్యెడునోచూడుము. (అని పాశుపతము సంధించి) ఓయస్త్రరాజమా!

మ॥ కరుణాలోకనచేతభక్తవరులన్ గాపాడువాఁడేనిశం
కరుఁ డశ్రాంతము; నీపునిక్కముగ నాగారీశునస్త్రంబవే
ని,రమానాథునిఁగృష్ణునమ్మితినయే నిన్ నామస్వాంతంబునన్
సురవైరున్ భటరాజితోఁడవిగతాసుఁజేయుమా! మ్రొక్కెదన్
(అనివిడువ దానవులు పురంబుతో గూడ భస్మమైపడుదురు)

మాత. (సంతోషముతో) ఏమీ? ఈదివ్యాస్త్రప్రభావము.

మ॥ కరులున్, వ్యాఘ్రములున్, మహోరగములున్ గంఠీరవంబుల్ నిశా
చర, గంధర్వ,విహంగ, కింపురుషులున్ శస్త్రాస్త్రముల్ జాలసం
గరరంగంబునఁబుట్టిపెక్కుగతులన్ ఖండించుచున్ మించుచున్

సురవిద్వేషులఁగూల్చుచుండెనరరే! శూరత్వమేపారఁగన్

అర్జు. మాతలీ! ఇచ్చటికార్యముగూడచక్కబడినదిగదా! ఇం
కనాలస్యమేల? రథంబుక్రమ్మరింపుము.

మాత. చిత్తము. (నిష్క్రమింతురు)



## అమరావతి

(సుధర్మామధ్యమున సర్వసింహాసనాసీనుఁడగు నర్జునుఁడును,
ఇంద్రుఁడును బృహస్పతి మాతలియు ప్రవేశింతురు)

బృహ. వాసవా!

చ॥ సుకలనుఁబారఁద్రోలియువసుంధరసాధుల రూపుమాపున
ప్పురమదురాత్మకాదనుజపాంసనులన్ జితవైరివీరులన్
దురమునవ్రేల్మిడిన్ గదిసి దోర్బలమేర్పడఁద్రుంచి మానులన్
సురలనుబ్రోచినట్టి రణశూరుని పార్థునుతింప శక్యమే?

మహేం. ఆచార్యా! ఒక్కభుజబలంబు ననేకాదు. ఇప్పార్థునిమ
నోనిగ్రహమును మునీంద్రులకు సైతముప్రశంసార్హ
ము. ఊర్వశీ——

అర్జు. తండ్రీ! నాయందు తమకుంగలవాత్సల్యాతిశయంబు
ననిట్లనిమోదరనితలంచెద. (బృహస్పతితో)

సీ॥ నుతికిఁ దగనట్టి మనుజునున్నతునిజేసి
కడుఁ బొగడనేల? మీయనుగ్రహముకలిమి

చేతనే! దానవాళి శిక్షింప జాలి
నాఁడ, లేకున్న నేనెంత వాఁడనయ్య?

మహే. అర్జునా! ఇందతిశయోక్తి రవంతయు లేదు।
సర్వముస్వభావోక్తియే.

మాత. ధనంజయా!

ఉ॥ కాననభూములందొ! గిరిగహ్వరసీమలయందొ! దాగియున్
మానసమందుఁ గల్గు ననుమానముచే దిగులొంది మాటికిన్
దానవులేగుదెంచిరని తత్తరపాటునఁ దొంగిచూచుమా
దీనతఁబాపినాఁడవు సుధీనుత! నీవెకదా! తలంపఁగన్

మహే. మాతలీ! నిజమువచించితివి.

అర్జు. తండ్రీ! దివస్పతీ! నిమిత్తమాత్రుఁడనగునన్నిట్లుపొగడు టపాడియే? తొలుత నేప్రత్యక్షమై శంకరుంగూర్చి తపంబొనర్పుమని హితోపదేశంబొనర్చి పాశుపతాస్త్రంబువడసినపిదప దిక్పతులతోఁ బ్రత్యక్షమైసకలాస్త్రములిప్పించితిరి. దీనికంతకునుమీయనుగ్రహమే కారణము మీసేవకుఁడనగుటచే స్వధర్మమునునిర్వర్తించితి.

గీ॥ ధర్మసంభవుఁడాది సోదరులఁబాసి
పెద్దకాలంబుజనె, వారు పృథ్వినేవి
ధంబునఁజరించుచుండిరో? దడయకిపుడ
జనెదనచ్చోటి కాజ్ఞనొసంగుమయ్య!

మహే. మాతలీ! ఈతని భూతలంబునకుం గొనిచని ధర్మజాదులకడ డించిరమ్ము. (అర్జునునితో) అర్జునా! నీమనోభీష్టానుసారము దివ్యాస్త్రములు లభించెంగదా! ఇంకేమింగావలయునో? కోరుము.

అర్జు. తండ్రీ! నీ యనుగ్రహముగలుఁగ నేకొఱంతయులేదు. ఐన నిట్లగుఁగాక

గీ॥ దితిజ బాధలు తొలఁగుఁగావుతజగాన
భారతీయులుధర్మసంబద్ధులగుచు
మాతృదేశోద్ధరణ దీక్ష మరువకుంద్రు
గాత, ధర్మంబె జయమగు గాత, యెప్పుడు

అర్జునవిజయము

సమాప్తము.



| పేజి | పంక్తి |
|---|---|
| 2 | 12 |
| ,, | 16 |
| 2 | 9 |
| 3 | 4 |
| 4 | 6 |
| 12 | 5 |
| 17 | 2 |
| 20 | 3 |
| 24 | 3 |
| 25 | 9 |
| 31 | 16 |
| 32 | 3 |
| ,, | 7 |
| ,, | 20 |
| 39 | 6 |
| ,, | 21 |
| 41 | 1 |
| 45 | 2 |
| ,, | 20 |
| 53 | 8 |
| 62 | 20 |
| 65 | 11 |
| ,, | 21 |
| 75 | 12 |

ఆఖరు పేజి నెం

# శుద్ధపత్రి.

| తప్పు | ఒప్పు |
|---|---|
| కాఫీ | కాపీ |
| లన్వర్ధాభిధానులు | లన్వర్థాభిధానలు |
| పార్ధతో | పార్థతో |
| ధ్వయంబు | ద్వయంబు |
| పార్ధా | పార్థా |
| దాగ | దాశ |
| నిము | మూని |
| నిచ్చటి | నిచ్చట |
| ంక | శంక |
| సెన్య | సైన్య |
| దక్షిణ | దక్షిణ |
| [illegible]ఘున్ | రఘున్ |
| దుప్రింపడిరి | దుప్రింపఁబడిరి |
| యాడబ | యాడబని |
| క్త్రి | వక్త్రి |
| నపార్ధుం | నపార్థుం |
| హా! | అహా! |
| రుంగూడి | వరుంగూడి |
| మణువేల | మణుతేల |
| యని | యనియుం |
| పార్ధుండు | పార్థుండు |
| వెళు | వెళ్లు |
| యీదిన మొ | నీదిన మొ |
| రాత్రు శ్వరులు | రాత్రు సేశ్వరులు |
| లోకన | లోకము |
| 87 | 78 |